ప్రత్యూషప్రచురణము. ౧౧.

# ఆముక్తమాల్యదా

# పర్యాలోకనము.

కవిరేవ విజానాతి కవేః కావ్య పరిశ్రమః
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనమ్.



శ్రీ నెల్దండ ప్రభాకరరావు.

[సాధనసమితి]

# అంకితం.

ఆంధ్రభాషాభిరుచి కల్పించిన

అస్మద్గురువర్యులగు

ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్య

ఎం. ఎ. గారికిని,

ఆచార్య శ్రీసరిపల్లి విశ్వనాధశాస్త్రి ఎం. ఎ. గారికిని,

ఈ చిన్నిపొత్త మర్పణ సేయబడినది.

# రా బో వృ న వి.

ఈ గ్రంథకర్త వి.

1. కావ్యతరంగిణి.

2. వ్యాసమాల.



# ఆశీస్సు

చిరంజీవి ప్రభాకరరావు నాకు శిష్యుడు. సాహిత్యోత్సాహి. నన్నాశీర్వదింపుమని కోరగా శిష్యుని యభ్యర్థనమును నిరాకరింపజాలనైతిని.

ఇందు చిరంజీవియొక్క పరిశ్రమయు, సాహిత్యాభిరుచియు సువ్యక్తమగుచున్నవి; విమర్శనాశక్తియొక్క బీజములును పొడకట్టుచున్నవి. పిన్నవాడగుటను, అనుభవము తక్కువయగుటను అనేక శబ్దార్థదోషములు దొరలినవి. బాల్యచాపల్యమును, గ్రంథకర్త కావలెననిన ఔత్సుక్యమును గ్రంథముద్రణమును పురికొల్పినవి. సహృదయులు దోసగులను పాటింపక గుణలేశములనే పాటించి చిరంజీవి నాశీర్వదింపవలెనని వేడుచున్నాను.

ఇతడు తన విజ్ఞానము నభివృద్ధిజేసికొని ఇతోధికముగా గ్రంథరచన సాగించుగాకయని నాశీర్వదించుచున్నాను.

ఉపాధ్యాయ శాల,

హైదరాబాదు.

15-3-45.

కురుగంటి సీతారామయ్య.

# పరిచయము

మా సాధనసమితి యీనాటికి ఆంధ్ర సాహితీ సంస్థలలో సముచితమైన స్థాన మలంకరించినది; సహృదయుల మన్ననలందినది; ఉదారుల దృష్టి నాకర్షించి యొడుదుడుకులులేక సాగుచున్నది. సహృదయులైన సాహితీపరులయొక్క, సాహితీపోషకులయొక్క ఆశీస్సులే మే మాకాంక్షించునది.

ఇంతవరకు గేయ, పద్య, కథా, నాటికలలో మా సభ్యుల సాధనాఫలితముల ప్రచురించితిమి. ఆంధ్ర సాహిత్యమును మథించి యందలి వెలుగు జిలుగుల వెలునరచు బాధ్యత సాహితీలోకము మీాద నున్నది. ఆ దృష్టితో వ్రాయబడినదే యీా గ్రంథము.

సాహితీ పిపాసియు, నుత్సాహవంతుడైన మా ప్రభాకరరావు నీవిధముగ పరిచయము చేయుట ముదావహము. 'ఆముక్తమాల్యద' 'అయఃపిండము' వంటిదని పండితులకు చెప్పనక్కర లేదు. అంతటిదాని 'పర్యాలోకనము' జేయ సాహ

సించినాడు మా సాధకుడు. ఇంతకుపూర్వ మీ విషయము 'మీజాన్' పత్రికాముఖమున వెలువడి నదే. ఇందు ప్రతిపాదితములైన సిద్ధాంతములకు సమితి యెంతమాత్ర ముత్తరవాదికాదని మనవి.

ఆంధ్రసాహితీ విద్యార్థికి 'ఆముక్తమాల్యద' యొక్క సమగ్రస్వరూప సాక్షాత్కారము, ఏతద్గ్రంథపఠనమం దాభిముఖ్యత కల్గినచో నీ 'పర్యాలోకనము' యొక్క ప్రయోజన మీడేరినట్లుగా భావింతుము. సహృదయులోకమా విధి గైకొందురని విశ్వసింతుము.

బ్రహ్మశ్రీ కురుగంటివారి 'ఆశీస్సు'లకు సమితిపక్షమున వారికి కృతజ్ఞత తెలుపుచున్నాము.

మా రాబోవు 'సాహితీ విపణి' సరసుల సమాదరమును చూరగొనునని యాశింతుము.

ఇట్లు,
కార్యదర్శులు.

శ్రీరంగం బోక పుణ్యధాత్రి యనుచున్
శ్రీవిష్ణుచిత్తాత్మజన్

సంరంభంబున పెండ్లియాడి పిదపన్
సద్భక్తునిన్ మోదమున్

పారావారమునందు ముంచి మహిమా
ప్రాగల్భ్యముం జూపె నే

నీరేజాక్షుఁడఁ గొల్తు నా మధురిపున్
నిత్యంబు తథ్యంబుగా.



చార్యులవారును తెలిపిరి. తరువాత భాషాభావ ములకు ప్రాధాన్యమిచ్చుచు యాంధ్రీకరణమందు స్వేచ్ఛమార్గ మవలంబించి యితరులకు మార్గ దర్శియై సంస్కృత దీర్ఘపదభూయిష్ఠముగ గ్రంథము వ్రాసి శ్రీనాథకవిసార్వభౌము డాంధ్రభారతి కపార సారస్వత సేవచేసి యశఃకాముడైనాడు.

తరువాత విద్యానగర మేకచ్ఛత్రాధిపత్య ముగా విజయనగర సామ్రాజ్యమేలిన (1509-1529) కృష్ణదేవరాయ కవిసార్వభౌముని కాలమున సాహితీరంగమందున ప్రబంధరచనయను నవీన రచన మొదలయినది. ఆ సరణిలో పెద్దన మనుచరిత్రము ప్రథమ ప్రసూనము.

తత్ప్రబంధధోరణిలో శ్రీరాయలు ఆముక్త మాల్యదయను ప్రౌఢప్రబంధరాజమును వ్రాసి నాడు ఈ గ్రంథమును వ్రాయుటకు విద్యానగర సాంఘికస్థితియే ప్రబల ప్రమాణము. అప్పుడు స్వభాషానురాగము పొటమరించినది. మాతృ భాషానురాగము హెచ్చినది. రాజులు సారస్వత ప్రియులై, విద్వాంసులై, కవులై మెలగినారు.

అప్పటి ప్రభువులు సరస సంస్కృతాంధ్ర శృంగార కావ్యరసైక లోలురు. అప్పుడే శ్రీరాయలు "దేశ భాషలందు తెనుగులెస్స" అని స్వర్ణాక్షరములతో లిఖించెను. ఆంధ్ర సారస్వత చరిత్రలో కృష్ణరాయల యుగమొక సువర్ణఘట్టము. ప్రజాసామాన్యము గూడ భాషాప్రియులై సారస్వతమే ఆహారముగ గైకొనుచుండిరి. ఈ రాజసాంద్రుడు 18-1-1471 నాడు జన్మించినట్లు చరిత్రకారులు స్థిరపరచి యున్నారు. ఈతడు తన యాస్థానమలంకరించిన మహాకవి కంఠీరవములచే "ఆంధ్రభోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌమ" అను బిరుదద్వయముల గాంచినాడు. 1512 లో దక్షిణ దిగ్విజయయాత్ర ముగిసినది. 1513–15 పూర్వదిగ్విజయయాత్ర ముగిసినది. గజపతుల ప్రాబల్యము మంటగలిసినది. వేంగిమండలమును గెల్చి కటకమును గెల్చి సింహాచలములో స్తంభమునాటి వెనుదిరిగెను. ఇప్పుడే శ్రీకాకుళక్షేత్ర స్వామియగు శ్రీరంగనివాసునిగాంచి ఆముక్తమాల్యద సంకల్పించెను. మను చరిత్ర వ్రాసినతరువాతనే ఆముక్తమాల్యద వ్రాయబడెను. ఏలనన ఆముక్తమాల్యద యందు పల్లెటూరి జీవితములను బాగుగ చిత్రించినాడు. అదియునుగాక

తానే గ్రంథమందు మున్నే కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తిపోయి విజయవాటిం (బెజవాడ) గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళ నికేతనుండగు ఆంధ్ర మధుమథను సేవింపబోయి హరిసరోపవాసర మచ్చటగావించిన పుణ్యరాత్రి చతురయామమున అని నుడివియున్నాడు. కుందుకూరి ఈశ్వరదత్తు గారు ఆముక్తమాల్యద వ్రాసిన తేదీని నిర్ధరించిరని అచ్యుతరావుగారు తెల్పియున్నారు. క్రీ॥ శ॥ 1519 జనవరి 26 వ తేదీని రాత్రి సుమారు పదిఘడియలకు కుంభసంక్రమణ కాలము, ఆ దినము మాఘ బ॥ ౧౧ కాబట్టి 27-1-1519 తేదీతో సరియైన మాఘ బహుళైకాదశినాడు శ్రీ రాయలు ఆముక్తమాల్యదా ప్రబంధరచనకు గడంగిరి. ఇంతటితో తత్కావ్యరచనాకాలము సంఘచరిత్ర తేలినది. ఈ గ్రంథమునకొక గ్రహచారము బట్టినది. కృష్ణరాయలు గ్రంథము వ్రాసినను వ్రాయలేదని. దానిని ముందు వివరించుచున్నాను.

దానిపై వోరుగంటివారు తీవ్రముగా విమర్శించిరి.

ఇంకొకటేమన, ఈతడు కవి కాడనియే వీరి వాదము. రాజులుకూడ గ్రంథములు వ్రాసిరి. శ్రీహర్షుడు (చక్రవర్తి, భట్టుహర్షుడు కాదు) నాగానంద, రత్నావళి, ప్రియదర్శిక యను మూడు నుత్తమ నాటకములు రచించెను. భోజరాజు చంపూరామాయణము వ్రాయలేదా? తంజనగరము రఘునాథరాయలు సాహిత్యరత్నాకరమును, శృంగార సావిత్రిని వ్రాయలేదా? నన్నచోడుడు కుమారసంభవము వ్రాయలేదా?

కొందరు విమర్శకులు పెద్దన రచించినదందురు. ఒక్కకవియే వ్రాసినదైనచో, (అనగా రెండు గ్రంథములందు) శైలియందుగాని, రచనా సంవిధానమందు గాని, కల్పనాసామర్థ్యమందుగాని పోలికలుండును. కాని యవి యేమియును లేవు. శ్రీకృష్ణరాడ్భూమీశానుడు శ్రీరంగమును దర్శించియేకదా ఆముక్తమాల్యద సంకల్పించినది. నేటివారివలె యాతఁడబద్ధమాడి యుండెననియేకదా వీరి నిర్వచనము. భగవంతుని యెదుట నెవ్వడును యసత్యమాడుటకు సాహసింపడు గదా! కంప,

కూరి వీరేశలింగము పంతులుగారును, గురజాడ శ్రీరామమూర్తి గారును, ఆముక్తమాల్యద రాయలు వ్రాసినదేయని నొక్కి వక్కాణించి యున్నారు. అదియునుంగాక మద్గురువర్యులగు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ

A Hand Book of Telugu Literaure

లో యిట్లని వాక్రుచ్చినారు.

Krishna Deva Raya was himself a great Poet His Amukta Malyada a Vishnu chitiya is an unique work in its own sphere. His deep study of human nature and naturalness of description giveto his work on "Exalted place" in the history of Andhra literature. The customs prevailed in those times are vividly described in it. It is a work which stood the test of the times and ranks with the greatest of the Telugu kavyas"

సన్నిధానమువారికి — ప్రతివచనము.

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలు గారు ఆముక్తమాల్యద పెద్దనకృతము కాదు, రాయలకృతము కాదు, వేఱొక ద్రావిడ వీరవైష్ణవుడు వ్రాసెనని యొక విమర్శనము వ్రాసిరి. (చూడుడు దివ్యవాణి విజయసంచిక 10-10-40)

దానిలో వారు

క॥ శ్రీ వేంకట గిరివల్లభ
సేవాపరతంత్ర హృదయ చిన్నమదేవి
జీవితనాయక కవితా
ప్రావీణ్య ఫణీశ కృష్ణరాయ మహీశా.

అని పెద్దనామాత్యుడు స్తుతించిన స్తుతికి రాయ లెంతమాత్రము దగడట. కవులతిశయోక్తిగా వర్ణింతురుగాన యిది యతిశయోక్తిగా వర్ణించుటయేనట. ఇయ్యది నాకసమంజసమని తోచెడిని. ఏలనన రాయలు కవికాడనుకొనడు ? ఆతని యాస్థాన కవియగు పెద్దనామాత్యుడు మనుచరిత్ర రచించిన దెల్లరకు తెల్లమేకదా ! కవికాదేని యొకని కవితను పరికించి. తగుబిరుద మొసగుట.

గడుంగడు సాహసకార్యముగదా!! అదియునుం గాక కవిగాని వానికి పెద్దన మనుచరిత్ర మర్మము కాదుగదా !!! పెద్దనాంధ్ర కవితాపితామహ బిరుదాంకితుడగుట సర్వజన విదితమేగదా !!!! శ్రీ శాస్త్రి గారు రాయలు పెద్దనకా బిరుదే యివ్వలేదందురేమొ? కవి కానివాడు యింకొకని కవితను పరీక్షింప జాలడు, ఏలనన

కవిరేవ విజానాతి కవేః కావ్యపరిశ్రమః
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్.

అను నాభాషణము జగద్విదితమే గదా! దీనిలో అరవజాతీయము లెక్కుడుగా నున్నవట. దానంజేసి ద్రావిడ వీరవైష్ణవుడట ఒకనికి యితర భాషలు వచ్చియుండ కూడదా! శ్రీ శాస్త్రిగారు ఖడ్గతిక్కనలో మైదానమను హిందీమాట వాడినారు. దానంజేసి ఖడ్గతిక్కనను వ్రాసినది హిందువారనవచ్చును గదా! అదియును ఆముక్తమాల్యద యుత్తమకావ్యము కాదట. ఉత్తమ కావ్యలక్షణములందులో యేమియులేవట. పాపము! వారి కావ్యములు విమర్శనము లుత్తమ శ్రేణిలో జేరునేమొ? వారికి ఆముక్తమాల్యదపై యింత యది

కారమున్నదో నాకును వారికాముక్తమాల్యదపై నున్న యధికారముతో సమానాధికార మున్నది. ఆముక్తమాల్యద ఉత్తమకావ్యమే కాకపోయిన దానిపై నీ యవక తవక విమర్శన వ్రాయుటకు తగిన కారణమేమిటో యాలోచింప వలసియున్నది. పాపము శాస్త్రిలగారికి రాయలు స్వప్నమందగ పడి వారుశ్లేషించిన విషయము చెప్పరేమో! ఆనాడు శ్రీరాయలు వ్రాసిన గ్రంథమును నీ నాడుకూడ చదువబడుచు యింకను యిప్పటివరకు 500 ఏండ్లు దాటినను యుండుటే యే తద్గ్రంథ ప్రాశస్త్య మును తెలుపుచున్నది.

ఇంతకు కృష్ణదేవరాయ లాముక్తమాల్యద వ్రాసిరా యను వాగ్వాదము క్రీడాభిరామము వల్లభామాత్యునిదా! శ్రీనాథునిదా యను వాగ్వా దమువలెనే బయలు దేరింది. ఇప్పు డల్లసానివాడు మనుచరిత్ర వ్రాసినదనుటకు ప్రబల సాక్ష్యమే మున్నది. కేవలము నమ్మికయే కదా! అట్టియెడ ప్రతివాడు వ్రాసిన ప్రబంధము వ్రాయలేదని నొక్కి వక్కాణింప వచ్చును. ఇంకను శాస్త్రిగారు గ్రంథమంత నోజోగుణ భూయిష్ఠమనిరి. ఓజోగుణ

భూయిష్ఠమనగ సంస్కృతపద సమాస ఘటితమట్లు సంస్కృత సమాస ఘటితములేని ఘట్టము లనేకములు గలవు ఇది కేవల మసంబద్ధవాదన. అందు కుదాహరణ మీ పద్యమును తిలకింపుడు.

ఉ॥ నేను మహాపతివ్రత మధుక నివ్రతయంబున
జొచ్చి యుందు పాం
డీడుట నాణముఁ దెలియు నించినబ్రేలెడు
దుర్మదాంధులన్
పోడిమిమాన్చి మన్మహిమముఁ బ్రకటించిహ
రింపు శుల్కముఁ
వాడునురోసినా డిహాము వైష్ణవుగా న్గొన
రింపు సత్కృపన్.

దీనిలోని చండాల బ్రహ్మరాక్షస సంవాదము, యామునాచార్యచరిత్రము, ఆముక్తమాల్యాద చరిత్రములు ఖండకావ్యములని వచించియుండిరి. మరొక విమర్శనమందు ఖండకావ్యములందు రసముండదని వచించియున్నారు. పాపము శాంతించుగాక, శ్రీశాస్త్రులగారి ఖండకావ్యములు

నాకు వచించిన పలుకుల యన్వర్థాభిధానము చేయుచున్నవేమొ? ఇవి ఖండకావ్యములు గావు. పూర్వకవులు వాగ్దేవిదత్త వరప్రసాదులు. వారికి గ్రంథము వ్రాయవలెనన్న యెక్కుడు కాల మవసరము లేదు. మొదటి ఘట్టము మూఢభక్తిని, రెండవఘట్టము జ్ఞానసంబంధ భక్తిని, మూడవది అనురాగ పూరితమగు భక్తిని తెల్పుటకు కవి యీ కథలగుచ్చి ప్రకృతిగాథకు సంబంధముకూర్చి పౌరాణిక ప్రబంధరాజముగా సిద్ధము చేసినారు. వీరిపై నొకరు విమర్శనరాసిన కోపపడుదురు. వారు శృంగారకంకణ విమర్శన వ్రాసినప్పుడు కవిభూషణ ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి మనస్తత్వము గ్రహించి యూహింపజాల లేకపోయిరేమో! వీరిపై యీ విమర్శన వ్రాసినందుకు నన్ను సింహ సభలో 'బాగుగ వ్రాయుండి మా బోటి వాండ్లపై మీరేనా వ్రాయండవారు మేము మీ బోటి వారికి ప్రోత్సాహ మిస్తామని' పలికినారు. అందుకు నేను "మీరింత ప్రోత్సాహమిస్తున్నారు కాబట్టి మీపై బాగుగ వ్రాసెదనని" ప్రత్యుత్తర మొసంగితిని. వారు చెప్పినట్లుగానే యీ సారి వారిపై నెక్కువగా వ్రాసినాను. ఇది

వారిని నిందించుటగాని వారి పాండిత్యమును ధిక్కరించుటగాదు. ఇది వారు వ్రాసిన విమర్శకు ప్రతివిమర్శ. వారలు పండితప్రకాండులు. వారి పాండితమునస్య సామాన్యము, అసాధారణము, అపార పారావారము. విమర్శకులందఱికి నిశ్చితాభిప్రాయముండదేమొ? ఏలనన వారికి మొదటి యభిప్రాయము మారి యీ విమర్శన వ్రాసిరని వ్యాసములో చెప్పిరి. రాయలు వ్రాసెననుట కింకొక ప్రబలప్రమాణ మేమనగా, శ్రీరాయలకూతురు తన గ్రంథమగు మారీచీ పరిణయమందలి యీ పద్యమే

అకలుష మాధురీకలితమై యలసానికపీనుబోలె న
ల్లికబిగి ముక్కుతిమ్మకవి
లీలను ముద్దుగుబల్కు పాండురం
గకవిగతిం బదక్రమముగల్గు కవిత్వముతోడ విష్ణుచి
త్తుకథ రచించు మజ్జనకు
దోరపుబత్తి నతించి మ్రొక్కెదన్.

[ చూడు గొబ్బూరి వెంకటసుబ్బయ్యగారి "భట్టుమూర్తి రామరాజ భూషణుడా" యను పుస్తకము 62 పేజీ ]

## 3

# శ్రీ కృష్ణదేవరాయలు ఆంధ్రుడు.

సన్నిధానమువారి వ్యాసమువల్ల రాయలు కర్ణాటుడని తేలుచున్నది. మూలములో చోళరాజని వున్నదట. కాని దీనిలో పాండ్యరాజని వున్నదట. దానికేమి, కవి రసానుగుణముగా నిచ్చవచ్చినట్లు మార్పుజేయవచ్చు; వారు ఖడ్గతిక్కనలో జేసినట్లు. ఇది యిట్లుండ వారి ఆచార్యులవారును, గుంటూరు క్రైస్తవకళాశాలాంధ్రోపన్యాసకులునగు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారు హైదరాబాదాంధ్రసాహిత్య పరిషత్తు వార్షికోత్సవమునకు విజయముజేసి ప్రసంగవశమున ఆముక్తమాల్యదనుగూర్చి యిట్లనిరి:

"ఆముక్తమాల్యద వ్రాసినది కృష్ణదేవరాయ కవిసార్వభౌముడే. ఇది నిర్వివాదాంశము. అది యినుపపెట్టెలో దాచపెట్టబడిన ధనము. దానిలోనున్న యలంకారములు, దానిలోని భావగాంభీర్య మెచ్చటనులేదు. ఆంధ్రవాఙ్మయమందంత

ప్రౌఢప్రబంధము కాదని నొక్కి వక్కాణించు చున్నాను. దాని యర్థము విప్పిచెప్పవారు వేదము వేంకటరాయశాస్త్రిగారు తప్ప వేరొకరు లేరు. దాని ప్రౌఢిమ యిదమిత్థమని చెప్పనలవికాదు. దాని యర్థము విప్పిచెప్పవారలు యెన్నడువత్తురో మనమీ కావ్యరసంబు గ్రోలుదుమో లేమో తెలియజాలమని తమ విచారపూర్వకముగు యుప న్యాసము ముగించిరి.”

ఏది యెట్లున్నను ఆముక్తమాల్యద వ్రాసి నది రాయలేనని ఘంటాపథంబుగా జెప్పగలను. పెద్దనగారు యిటువంటి గ్రంథము వ్రాయుటకు జన్మాంతము తపస్సుచేయవలెను. పలాన పెద్దన ప్రవరాఖ్యునిగూర్చిన పద్యము రాయలు విష్ణు చిత్తునిగూర్చి చెప్పిన పద్యమును పోల్చిన దేటప డును. అదియునుంగాక వంశావతారవర్ణన పద్య ములు కొన్ని మనుచరిత్ర ఆముక్తములలో నుండుటచే పెద్దన వ్రాసినదని చెప్పరాదు. తన ముఖ్యకవి గనుక రాయలు యాతని వంశావతారవర్ణనా పద్య ములు వ్రాసుకొని యుండవచ్చును.

ఇప్పుడు శ్రీ రాయ లాంధ్రుడా కర్ణాటుడా యని వాగ్వాదములు జరుగుచున్నవి. ఆతడాంధ్ర మందు గీర్వాణాంధ్రనికషోపలము గాగు ఆముక్తమాల్యద వ్రాయుటే ఆంధ్రుడని తెల్పుచున్నది. అతడు కర్ణాటుడైన "దేశభాషలందు తెనుగు లెస్స" యని స్వర్ణాక్షరములతో లిఖించడు. అతడు కర్ణాటభాషయందు వ్రాసిన గ్రంథము లేవియును లేవు. గీర్వాణమున నాతడు సత్యావధూప్రీణనము, మదాలసచరిత్ర, సకలకసాధార సంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి, జాంబవతీ పరిణయములను వ్రాసెను. కాని యిప్పుడు జాంబవతీ పరిణయము, సకలకళాసార సంగ్రహములు మాత్రమే లభించినవి. వాటి ప్రశంస ప్రథమముననే చేసియుంటిని. అతడు కర్ణాట కవీశ్వరుల నాదరించిన నాతనికొక బిరుదముండెడిది. కాని యాంధ్రకవి కంఠీరవముల నాదరించుటచేత నాతని కాంధ్రభోజ బిరుద మొచ్చినది. ఆంధ్రభోజుడనగా కేవలము కవుల బోషించినందుకు కాదు. కాని, భోజుడు తన పాండిత్యము తెల్పుచు చంపూ రామాయణమును వ్రాసెనుకదా! అనగా నీత డాంధ్రమున భోజునికి సంస్కృతమందెంతో

సాహితీపటిమ యుండెడిదో తద్వతే రాయ లాంధ్ర మున నంత సాహితీపటిమ కేమియు దీసిపోని వాడం గూఢార్థము. దేశము కర్ణాటమై యుండవచ్చును కాని, యాతడు కార్ణాటుడు కాడు. విజయనగర సామ్రాజ్యము కర్నాటసామ్రాజ్యము కాదు. శ్రీ నాథుడు "నా కవిత్వంబు నిజము కర్ణాటకభాష" యనెను. దానినిజేసి అక్కిరాజు ఉమాకాంతవిద్యా శేఖరులు శ్రీనాథుని కర్నాటుడనెను. అతడు సంస్కృతము తెనుగు సమానముగా సమ్మిళితమైన భాషను కర్నాటభాష యనెను. కాని యాతడు కర్ణాటుడు కాడనియేనా వచించితది. ఈతడు కర్ణా ట దేశమును కాదు నేలినది. గోదావరీ నదీ తీరము నుండి శ్రీరంగముదనుకనున్న దక్షిణ దేశమనబరగు విజయనగర సామ్రాజ్యమును "నా విష్ణుః పృథివీ పతిః" యను నా భాషణమును సార్థకము చేయుచు నేలెను. ఈతని కులమును గురించికూడా వాదప్రతి వాదములు కలవు. మరియు నాతని దాసీపుత్రి డందురు. కాని నాకుజూడ దాసీపుత్రుడైనను పూర్వజన్మ సంస్కార పూజవలన విష్ణుభక్తిపరుడై దిన మలంకరించెనని విష్ణుచిత్తీయము వ్రాయుటచే నెల్లరకు తెల్లముగున్నది.

# 4

# ఆముక్తమాల్యద కథాసారము.

## విష్ణుచిత్తుని కథ.

వైజయంతములమించు ప్రాసాదములతో, చైత్రరథమునుమించు రమణీయోద్యాన వనములతో, ద్రావిడాంగనల చతుర పరిహాస విలాసోక్తులచే, లక్ష్మీనారాయణుని యపూర్వమగు కోవెలతో, విద్వాంసులైన స్త్రీలతో, వారనారీ జనంబుల విలాసములచే, రమణీయ మధుర సుగంధ పుష్పవాటులతో, పోకమ్రాకులచే తియ్యని మాకందములచే, కోవెలలో ప్రతిసాయంకాలము వాయించబడు పటపటాత్కారంబు భేరీనినాదములతో, అతిథిసత్కార పూజాసక్తులగు భాగవతోత్తములచే శ్రీవిల్లిబుత్తూరు సెలంగుచుండెను. ఆ విల్లిబుత్తూరిలో, ద్వయపద్మ పద్మవదనుండును, అద్వంద్వుండును, అన్వర్థాభిధానుండును, చందోబృందతదంతవాళ పఠనా సంజాత పర్జన్య నిష్పంద ద్వైతసుసంవిదాలయుడును, నిష్ఠాగరిష్ఠుండగు విష్ణుచిత్తుడను వైష్ణవోత్తముడు నివసించుచుండెను. అతడు

శ్రీరంగేశ్వర పాదారవింద కందళితాంతరంగుండునై యుండెను. ఆ భాగవతోత్తముడు హిమాచల మలయాచలములకు పోవు బ్రాహ్మణులకు "అభ్యాగతః స్వయం విష్ణుః" అను ఆచార్య న్యాయమును చేసి, తలలంటుక స్నానమాచరించుటకై సున్ని, యిప్పపిండుల నిచ్చుచు, పెరుగు, పాలు, ఘృతము నీరు మజ్జిగ వడియములతో, బుడమ వరుగులతో చెవులలో పొగరెక్కు చిమ్మరేగెడి అరవచారులతో పోరిలి లంగాయలతో, యవ్వారిగాగ, సంతుష్ట మృష్టాన్నుల జేయుచు వారల యమందానంద సాగర పంకనిర్మగ్నుల జేయుచు నాగేంద్రశయాను దివ్యప్రబంధ సంధాన ధ్యానములతో పాపపరిహార మొనర్చుచుచు తనకు పెరియాళ్వారను నామము సార్థకము చేసికొనుచుండెను.

ఇట్లుండ వస్త్రస్థలీ చుంబితాంబరమైన ప్రాకారములతోడను, దివ్యాంగనల ధిక్కరించు లలితాంగీమణీ రత్నములతోడను, నర్మమర్మగర్భ మాటలాడు పుష్పలావికలతోడను, కుబేరుని ధిక్కరించు వైశ్యశిఖామణులతోడను, మేఘరంజి నాలాపన సేయగల సంగీత విద్వాంసులతోడను, సాంద్ర

మధురయగు దక్షిణ మధుర యలరారు చుండెను. ఆ ధరణీస్థలి నేలు క్ష్మాపాలచంద్రుఁడు మత్స్యధ్వజుఁడు “ రాజానాం బహువల్లభా ” యను వాక్యమును ప్రతిపదసార్థకము సేయుచు కేవలము విషయసుఖా స్వాదలోలత్స్వాంతుఁడై భటః కర కరవిలసిత అసి త్రోత్పల వనవాటిలో దిమ్మరు దేటియగు లక్ష్మిని కైవసము గావించుకొనుచు కాలము గడుపుచుం డెను. ఇట్లుండ నొక్కనాఁడు దేశాటనము జేసిన బ్రాహ్మణుండొకఁడు “ దేశాటనమ్ పండితమిత్రతా ” యను శాస్త్రప్రమాణమువలన రాజు భోగినికడ కేగుచుండ

......నెలఁ చతుర్ద్వయి నివృప్తి దినాళికి......

అను పద్యము చదివెను. దీనినివిని యా నృపాల శేఖరుఁడు మనంబున భయమంది భోగినికడ కేగుట మాని గృహంబు కేగె. మరునాఁడు తన కొలువు కూటమందుగల నిఖిలమత విద్వాంసులను పిలిచి “ మీ మీ శాస్త్రంబులలో నెవ్వఁడు మోక్షం బాలయించునో ” నిశ్చయించిన వానికి వరశుల్క మిత్తునని వరాలసంచిని వేలాడగట్టెను. సభలో కొందఱుయింద్రుఁడని, కొందఱుచంద్రుఁడని, కొందరు

అగ్నియని పిలుచుచుండ శ్రీమన్నారాయణుండు విష్ణుచిత్తునకు సాక్షాత్కరించి భక్తశిరోమణీ! పాండ్యరాజు మోక్షార్థియై యున్నాడు. ఆ వాదమందు నీవరిగి శ్రీరంగేశ్వరు డొక్కడే సత్యమని తెల్పుమని కోరిన యాతడక్షయ్యంబగు భక్తిదేల కాఁడ భక్తవత్సలా! నాకు శాస్త్రపరిచయమా నాస్తి, జ్ఞానలవ దుర్విదగ్ధుడను. మీకు స్నానార్థము నీరు తెచ్చుటయో, మీ దేవాలయమూడ్చుటయో తప్ప యితర కైంకర్యంబులుసేయ సోపనట్టి నే నెవ్విధమున వాదము గెల్తును. యింకెవ్వరినైన యీ కార్యమునకు నియోగింపుడు. క్ష్మాపాలశ్రేష్ఠుని యాస్థానమందజయము గల్గిన సయశంబులీకుగావా యని. నీవయేగుము, జయమ్మగును. శ్రీమన్నారాయణుడే సత్యమని చెప్పుమని తెల్పి పురికొల్పి భక్తశిఖామణీ మద్భక్తులనాదరించుట మద్ధర్మముగదా యనిన నాతడాదేవుని యాదేశానుసారము మత్స్యద్విజుని యాస్థానమున కరిగెను.

యట్లాస్థాన మండపముజొచ్చి తత్పాండ్య మత్స్యద్విజుని యతిథి సత్కారమునకు పాత్రుడై

రాజదత్త వరస్వర్ణ రత్నపీఠస్థుడై “ సర్వం విష్ణుమయమ్ జగత్ ” యను శ్రుతివాక్యము నాధారముగ జేసికొని యద్వైమత నిరసనగావించి శ్రీమన్నారాయణుడే సత్యము సర్వము మిథ్యయని “ ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దేవ దివ్యో దేవఏకో నారాయణో హరిః ” యను నుపనిషద్వాక్యంబు ప్రమాణముఁజూపి వైష్ణవమత స్థాపన చేసి విష్ణుభక్తి నిచాటు గాథ వేఱొండుగల దాలకింపుడని యిట్లని వచింప మొదలిడెను.

## ఖాండిక్య కేశిధ్వజ వాదము.

పూర్వము నిమివంశాలంకారుడగు దర్వ జుడను వృద్ధునికి కృతధ్వజుడను, మితధ్వజుడను నిద్దఱు తనూభవు లుండిరి. వారిలో మొదటి వానికి బ్రహ్మజ్ఞానియగు కేశిధ్వజుడును రెండవ ఖాండిక్యుడను కర్మయోగుడును కల్గిరి. వీరొండొరులు రాజ్యమునకై పెక్కుదినములు జనభయంకరములైన సమర మొనర్చిరి. తుదకు ఖాండిక్యుడు కేశి

ధ్వజుఁ కోడి పారిపోయి గుడిసెలో నివసించుచుండెను. కేశిధ్వజుడు తుదకు రెండు రాజ్యములు తనకే చేరగా సంసార సాగర తాపత్రియ ఘోషల నుండి విముక్తుడగు నిమిత్తంబున నొక జన్నంబు సేయంగ సమకట్టియుండగా యజ్ఞధేనువు యజ్ఞశాలనుండి యడవిలో గడ్డిమేయుచు పులితోకను దాటి దానిగని వెఱగంది యఱచుచు దాటెను. అంత నా కంఠీరవము భయంకరారావమొందు నల్ల యచ్చట పసువులకాపరి త్రెళ్ళి నేలబడెను. అంత నా శార్దూలము మొదవును లాగుకొని గుహలోనికీడ్చుకపోయె. ఇట్లుండ నా పొలము కాపులు కోలాహలము సలుప వెఱగంది ఆ పులి నా గవిని వదలి పారిపోయె. యజ్ఞగవి వ్యాఘ్రిఘాతమైనందులకు కేశిధ్వజుడు ప్రాయశ్చిత్తంబడుగ ఋత్విక్కులు తమకు తెలియకనిరి. శునకముని ఖాండిక్యుని యడుగుమనెను. అంత నా కేశిధ్వజుడో మునీంద్రా నాతడు నన్ను చంపెనా నాకు కీర్తుఫలము దక్కును. సాధుత్వముచే ప్రాయశ్చిత్తము తెల్పెనా నా క్రతువు సంపూర్ణముగ నెఱవేఱును. ఎటులయినను మంచిదే అతనివద్ద కేగెదను. అతని ప్రశాంత వేషమునుగాంచి ఖాండిక్యుడో దుష్టుడా ధనధాన్యా

దుల హరించి మరల నన్ను జంప ప్రశాంత వేషము ధరించి వచ్చితివా యనెను. అందులకు కేశిధ్వజుడు తాన వచ్చిన నిమిత్తంబు తెల్ప నాతని ప్రజలంతయు "ప్రాప్త వైరి ప్రమోక్షాను కృత్త్వైవ సుననమ్ సుఖమ్" కావున యాతని జంపుమని వేనోళ్ళ పలికిరి. కేశిధ్వజు "డన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమా" యనెను. అంతట ఖాండిక్యుడు "బద్ధాంజలి పుటదీనుఁ గుద్దిష్టుండై శరణుజొరగ గూల్చుట కడుగీ డుద్ధత పరలోకాజ్ఞస బుద్ధి" యను కణ్వమహాముని వాక్యమును జేసి తత్కేశిధ్వజాగమనంబునకుగల నిమిత్తంబు చిత్తంబునందరసి తగు ప్రాయశ్చిత్తము తెలుప నాతడును క్రతువొనర్చి కృతకృత్యుడయ్యె. ఇట్లొనరించి ఖాండిక్యుని యొద్దకేగి ఆచార్యవర్యా మీకు గురుదక్షిణ యిచ్చుకొరకై యరుదెంచితి వలసిన దడుగుమనిన తత్ఖాండిక్యుడు నిఖిల జలధి వేలావలయితమగు రాజ్యము నాకు వలదు. కాని సంసార పారావారతీరంబు జేరు మార్గం బుపదేశింపుమనిన శ్రీమన్నారాయణుని ప్రార్థింపుమని చెప్పె. తదనంతరంబ నా ఖాండిక్యుడు విష్ణునుపాసింప తపోవనంబు కరిగెనని పాండ్యరాజునకు చెప్పి విష్ణుచిత్తుడు శ్రీమన్నారాయణుడే

నుపాస్యుడని బోధించినంత నాతడందుల కియ్యగొనిన మరుక్షణమే వరాలసంచి నేలగూలెను. ప్రతివాదులందఱు విస్మయావిష్ట చిత్తులైరి. రాజు విష్ణుచిత్తుని సామర్థ్యమునకు భగవన్మహిమంబు కచ్చెరువొంది యాతని భద్రగజారూఢునిజేసి యుత్సవము జేసెను.

దేవతలు పుష్పవర్షముల గురిపించిరి. విష్ణుచిత్తుని జయమునకు దేవతలు బళిబళి యనిరి. యతులు వైష్ణవమత స్థాపన యయ్యెననిరి. పాండ్యుడు విష్ణుచిత్తుని భద్రగజారూఢునిజేసి శ్రీవిల్లిబుత్తూరులో దిగవిడిచి రమ్మనుటయు వారు తదాజ్ఞాపాలన గావింప విష్ణుచిత్తుడు స్వనగరంబు జేరుమార్గమధ్యంబున విష్ణుచిత్తునకు లక్ష్మీశ్వరుండు సాక్షాత్కరించిన ప్రత్యక్షంబైన పరమేశ్వరున కక్షయ్యంబగు భక్తితో స్తుతింప హర్షతరంగికస్వాంతాంతఃకరణుడై భక్తప్రివరా! నీవుగెల్చిన వరాల సంచి నిటుతెమ్మని దీసికొని తిరోహితుడయ్యెను. విష్ణుచిత్తుడును స్వనగరంబున కరిగి తొంటికంటె యెక్కువ భక్తిపరుడై వుండె. ఇట్లుండ నొక్కనాడు మధ్యాహ్నసమయ మాలికా సమారోపణా

నంతరమున మందిరమునకు బోవుచుండ మందస్మిత సుందర వదనారవిందుడై వీక్షించి యయ్యరవింద నందనుండు శతపత్ర నిఁయ కిట్లనియె. ఈ విష్ణు చిత్తుడు యామునాచార్య లోకక్షేనుమీ యనగ యీ కాంత మనోహరా! యీ యామునాచార్యు డెవరో కెవెంజింగింప వలయుననుటయు శ్రీహరి కరుణాయత్త చిత్తుడై యిట్లు సెప్పదొడగె.

# యామునాచార్య చరిత్రము.

మద్భక్తుడగు యామునాచార్యు డొకడుం డెను. ఆతడు బాల్యమందె అష్టాదశ విద్యలందస మాన పాండిత్యంబు గడించె. ఇట్లుండ పాండ్య రాజొకండు యీ మత్స్యధ్వజునకు పూర్వుడు గలడు. యింతీ, యాతని దురంతం బింతింతని నుతింప శక్యముగాదు. ఆతడు శివభక్తిపరుఁడు. మద్భక్తుల నాదరించడు, శివభక్తులకే యగ్రహా రము లిచ్చును. ఇంక, నాతని యర్ధాంగలక్ష్మి మద్భక్తురాలు. ఎప్పుడు నప్పడతి మ త్క ధ ల

నుత్కంఠతతో వినుచు కాలము పుచ్చుచుండెను. ఇట్లుండ నేను యామునాచార్యుని యా సతీమణి ద్వారా సభామంటపంబు ప్రవేశించి వైష్ణవమత స్థాపన చేయుమని చెప్పి పంపితిని. మదాజ్ఞానువర్తియై యామెను చేరబోయి శివభక్తుల గెల్తునని శపథము చేసెను. అంత నక్కాంత మదింతింత యనుచు నాథునొద్దకేగి గలతెఱంగెఱింగించిన వెఱగంది నద్ధరణీరమణుండు డెట్టకేలకు సమ్మతించెను. యామునాచార్యుడు సభకరుగు సమయమున రావివృక్ష మొక్కటియె సాక్ష్యముగా నుండెను. యామునుడు "శూన్యహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుమ్" అను స్మృతి వాక్యంబు ప్రమాణముగ జేసి పాండ్యరాజు సభాస్థలి ప్రవేశించి యజ్ఞోపవీత మర్పించి కూర్చుండెను. అప్పుడు పాండ్యరాజు సతీమణితో నిట్లనెను. ఉవిదా! నీ మతస్థుడోడెనేని శివలింగములు కట్టుకోవలె. మా మతస్థుడోడిన మురఘస్మర భక్తాంకితుడనై యర్ధరాజ్య మొసగగలనని ప్రతిజ్ఞ చేసికొనిరి. యామునునిగాంచి చిన్నవాడవు నీకు వాదనైపుణి తెలుసునా యని యడిగెను. అంత నాతడో నృపాలా శ్రీవిష్ణు యాదేశానుసార మరుదెందితి యొకవేళ

విష్ణువే యపజయము గల్పించిన యెడల నే నే మి చేయులేను. నేనేమి నీ వద్ద ధనముకై వాదమిషంబున రాలేదు. నే నోడిన అమ్మ దెచ్చిన విద్వాంసుడనవద్దు అని పలుమారులు విన్నవించి వాదసరణిలో యన్యమత ఖండనగావించి స్వమ స్థాపనజేసి యా రాజసాంప్రుని వైష్ణవునిగజేసి యర్ధరాజ్యము పొంది రాజు చెల్లెలిని వివాహమాడి కేవలము విషయ సుఖాస్వాద లోలుతస్వాంతుడై యుండెను. అతడు దిగ్విజయము చేసియుండెను. నేను కలలో కనబడిన క్షణమే మేల్కాంచి తపోవనంబున కరిగి శ్రీరంగేశ్వరుని గొల్చెను.

# ఆముక్తమాల్యద చరిత్రము.

ఒకనాడు విష్ణుచిత్తుడు విశాలమైన వృక్షవాటికలో నొక తెల్లతామర కొలనుచెంత తులసి తోటచెంత చెట్లనీడల ప్రతిబింబముచేత పచ్చరాళ్ళ వేదిక యొప్పారు పాలగచ్చు తిన్నియపైన నొక చిన్నినాడు నిసుగును సద్యోఃదళిత పద్మరాగాంకూ

రములగు వర్ణములగు నరకాల్లును చేతులును మోవి యునుంగల దానిని గాంచెను. ఆ శిశువును గాంచి యాశ్చర్యమొంది చెంతకేగి యా కోమలి కోమ లత్వ(ఫు) మేనిఏన్నెను, శుభలక్షణ సముదాయము కొంతసేపు తెప్పవాల్పక సప్రాపుబోణిని పరికించి సంతసమంది అహహా! ఏమిది నా పూర్వపుణ్యా దినము నేను బిడ్డలులేని వాడనని నా మీద కరు ణించి నారాయణుడు కూతుగ నిచ్చెనని తలంచి ముదమేపారగ తన తొయ్యాలికివ్వ నయ్యాలవేణి నెయ్యంపుకూతుగ బెంచుచుండె. ఇట్లు దినదిన పరివర్ధమానయగు నబ్బాలికారత్నంబు యవ్వన వతియై భగవంతునియందు కందర్పబాణుని నిశిత శరపరంపరలకు లక్ష్యమగుచు శ్రీపతినిగూర్చిన పాటలను చర్యలను లక్ష్మీశకల్యాణముల గాంచుచు సంతసించుచు తా నా విష్ణువును పరిణయమాడి యాతనితో కుసుమాస్త్రకేలిని దేలుటెన్నడోయని చాతకంబు మేఘాగమంబు కరణి వేచియుండె. అదియునుగాక దుర్భర మనోజ విషాక వేదనానల దందహ్యమానయగుచు కాలము గడుపుచుండెను. జనకుడు కట్టినమాలికల తాను ధరించి తన ప్రతి బింబము చూచుచు యానందించు చుండె. విష్ణుచి

త్తుండు మాలికల ధరించుచున్నదని యెఱుగకయే స్వామి కల్పించె. ఒక్క నాఁడామె యిట్లు విరహ వేదనానలమందు దందహ్యమానయగు తెఱంగంత మెఱింగి వెఱగంది స్వామికి గల తెఱంగెఱింగించిన యయ్యరవింద నందనుండు సుందరవదనారవిందుడై యిట్లని యానతిచ్చె.

# చండాల బ్రహ్మరాక్షస సంవాదము

నా భక్తుడు మాల దాసరి యుండెను. వాడు పూర్వము వామనావతారమున నే వసించి యున్న పుణ్యనివాసంబునకుఁబోయి మూఁడామడల దూరమందున్న నొక గ్రామము కరుగుచుండి నివసించుచుండి ప్రతిదినము బ్రాహ్మణముహూర్తంబున యిచ్చటికివచ్చి నా స్తోత్రములను (కురుగడి) కైశికిరాగమున పాడుచుండెడి వాడు. మత్ప్రీతి కొఱకు తనకు నిర్దేశింపబడిన జాతిధర్మంబు నాచరించు చుండెను. ఒకనాఁడా దాసరి యర్ధరాత్రిమున చెంత నొకయింట పిల్లిచోరగా దానికి గృక

వాకము కూయగా మాతలకు వేగుకూతయాని తల
చినవాడై లేచి వెంటనే నన్ను బొడుటకు వచ్చుచు
దారిలో కొన్ని కంటక భరితములైన మార్గముల
దాటి పోవుచుండెను. ఆ విష్ణుభక్తుడట్లు పోవుచుం
డగా నాతనికొక పెద్దమఱ్ఱి గాన్పించె. దానికి
రెండేసి క్రోశముల నిడివిగల యూడలు దిగియుం
డెను. వాని పై భాగములనిండి కొమ్మలు మొలిచి
నవి. ఆ కొమ్మలోనుండి కొమ్మలు మొలిచి యుండి
నవి. గాలివల్ల ఆ వృక్షపాకులలోని గీరలు నా దగ్గి
రకు రాకుడు, నాలో బ్రహ్మరాక్షసు డున్నాడు
యని నివారించు చున్నదో యున నొప్పుచుండెను.
ఆ దాసరి ఆ చెట్టును సమీపింప ఒక బ్రహ్మరాక్ష
సుడు కాన్పించెను. అ బ్రహ్మరాక్షసుడు మాల
దాసరిని పోకుము. నిలుపుము నిన్ను చిత్రవధ చేతు
ననెను. ఆతనిజంప నుంకించుచున్న బ్రహ్మరాక్ష
సునిగని ఓయీ! నిన్ననిమిషులైన గెల్వజాలరు
నీవు నన్ను చంపుట మంచిదే. చంపిన యీ చం
డాలజన్మ తొలగును వైకుంఠప్రాప్తమగును. నే
నొక అనిమిషుని యగుదును. అందులకా బ్రహ్మ
రాక్షసు డో మాతంగీ! అమరులు చెడ్డవారట,
వలన "ప్రథమాం పిబ తేవహ్నా యను" శాస్త్ర

వాక్య మెఱుంగవా! ఓయీ బ్రహ్మరాక్షసుడా నీకు నా దేహమీయక మానను కాని నేను ప్రతి దినము నాచరించు వ్రతమొకండు కలదు. దాని పేరు సత్యాం సాహ్మప దేశ అన, నాతడు నీవు మోస గాడవు తప్పించుకపోజూచుచుంటివన మాలదాసరి యిట్లనెను.

ఉ॥ ఎవ్వనిజూడ్కి చేసి జనియించు జగంబు వ
సించు నిజ్జగం
బెవ్వనియందుడిందు మరియెవ్వనియందిది
యట్టి విష్ణువో
విశ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి
నౌదు నేను నే
నెవ్విధినైన నిన్నడియనేనియన న్వని
బంధ మూడ్చెనక్.

అంత నా దాసరి విష్ణు భక్తి సంకీర్తన గావించి మరల నా రాక్షసునొద్దకరుగ యతడు సంతసించి మాతంగున కిట్లనియె.

ఓ మహాత్మా నీకెన యెవ్వరు? నీవు మధుర మయిన హరిస్తోత్ర గానతరంగభంగికలవలన సంసార

సాగరంబు దాటుచున్నడవు "ధన్యోస్మి" యని యాతనిని కౌగలించుకొనెను. అంత మాలదాసు రి మహాత్మా! నా దేహమర్పించుచుండ నీవేల గైకొనవన యాదృచ్ఛికి రసాశ్రిత సంతుష్టాంత రంగుడై నేను సరిమానముగ తీసికొంటిని నీవంటి భాగవతోత్తముల జంపిన నాకేమి యబ్బు. నేను ఘుటాకిద్గసకంబె నెక్కుడ పాపమాచరించ లేదు. తన చరిత మిట్లని చెప్పమొదలిడెను.

# బ్రహ్మరాక్షసుని పూర్వవృత్తాంతము

పూర్వజన్మమున చోళదేశమునందొక యూరిలో యుంటిని. నా వైదుష్యముచే తార్కి-కుల గెల్చుచుంటిని. శ్రోత్రియాగ్రణులు పౌర పాట్లు బయటవేయుచు స్మార్తకర్తల ప్రయోక్తలు ఖండనకారికా పుస్తకములు విప్పగానే పరిహాసము చేయుచుంటిని. విద్వాంసులు గ్రంథపరిచయముల జల్పవిధానమున నవమానపరచుచుంటిని. ఇన్నడ వడిం ప్రభిన్నగండంబగు వేదండంబువోలె యల్పు

దెబ్బలకు మిక్కిలి గాయపడితిని. ఇంతలో నా బిడారులలో నా యిల్లాలి బంధుగుడొకండు వాడు పల్లకి తీసుకవచ్చి దానిలో నన్ను పెట్టి దీసుకపోవు చుండ యాతనికి దాహమైనందున నీరు దాగివచ్చె నెను. అంతలో నే చనిపోతిని. అంతలోనే నాకీ రూపు వచ్చెనను ముహూర్తముననే నాతడు సోమ శర్మ యను బ్రాహ్మణోత్తము డయ్యెనని భగవం తుడు విష్ణుచిత్తునకు చెప్పి నీ యాడునిసుగు అముక్త మాల్యద, ఆమె శ్రీరంగేశ్వరుని వలచియున్నది. ఆమెను శ్రీరంగనివాసస్థుడగు నా శ్రీరంగేశ్వరున కర్పింపుమని తిరోహితుడయ్యెను.

స్వామి యాజ్ఞానుసారము కూతును వెంట బెట్టుకొని విష్ణుచిత్తుడు శ్రీరంగమునకరిగి యొక్క వేళయందు స్వామికి కైంకర్యములు సేయ నియో గించెను. అంత నొక్కనాడు భగవంతు డామెను 'కామాంధోపి నపశ్యతి' మరియు 'కామాతు రాణాం నలజ్జా నభయం' కావున యా భగవం తుడు అముక్తమాల్యద రూపవిభవ చిత్తవిభ్రమ రూది సౌశీల్యంబులకు మనంబెంతయు చలింప చక్కెరవింటివాని శరపరంపరల కాగలేక తనలో

నైర్యము చేసుకొనియెను. అప్పుడీ విషయమెఱిగి విష్ణుచిత్తుడు చీవాట్లుపెట్టెను. అప్పుడా భగవంతుడు సంతసమంది ఆముక్తమాల్యదను పరిణయమాడుటకు సమ్మతించెను. అప్పుడు విష్ణుచిత్తుడు తనయతోగూడ శ్రీవిల్లిబుత్తూరు కరిగి తరలివచ్చిన బృందారక బృందంబులకు తగు సన్మానంబుగావించి విశేష వైభవములతో తనయకు వివాహము గావించెను. భగవంతుడుకూడ "మాంగల్య తంతు నానేన" యని నామెకు మంగళసూత్రముగట్టి వివాహము చేసుకొని సుఖంబున నుండెను.

## 5

## మాతృకకు-దీనికి మార్పులు

ఆముక్తమాల్యద యితివృత్తము, ద్రవిడ వాఙ్మయమునుండి గ్రహింపబడినది. పలనన కళా పరిపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు సంజీవనీ వ్యాఖ్యలో

ఉ॥ వ్రాసితిమున్ ప్రతాపుకథ పండితమాన్యుల గుండెనీరుగా, వ్రాసితి వెన్క నయ్యుషవివాహము సిద్ధ సుధా ప్రవాహమున్,
వేసరకాంధ్ర నైషధము విప్పినిధుల్ నెఱచూఱ లిచ్చితిన్ జేసితినిప్డు తత్పరత సేవలు "చూడుకు డుత్త దేనికిన్"

అని వ్రాసెను. ఆముక్తమాల్యద చరిత్రము పెరియాళ్వారు చరిత్ర ద్రవిడ వాఙ్మయమునుండి గ్రహింపబడియెనని తెలుచున్నది. దీనిలోని పెరియాళ్వారు చరిత్రము శూడుకొడుత్త నాంచియారు వైభవమునుండి అరవవాఙ్మయములోనుండి గ్రహింపబడె. దీనికి నంబూరి కేశవయ్యంగారు (పన్నిద్దరాళ్వారు చరిత్రను) ఆచార్య సూక్తి ముక్తావళి యను పేర యాంధ్రీకరించెను. యామునాచార్యచరిత్రము, ఖాండిక్య కేశిధ్వజ వాదములు సంస్కృత విష్ణుపురాణమునుండి గ్రహించి యలతిమార్పులు గావించి రసానుగుణముగ వాక్పుత్కృతిచే వ్రాసెను. చండాల బ్రహ్మరాక్షస సంవాదము వరాహపురాణాంతర్గత మైనకథ. నంబూరి కేశవయ్యంగారు ఆచార్య సూక్తి ముక్తావళిలో పెరియాళ్వారు చరిత్ర

9 పద్యములలో కలదు. ఆముక్తమాల్యద దానిలో 24 పద్యములు కలదు. ఇవియే దీనికి మాతృకలు. ఆముక్తమాల్యదను యీ క్రిందిఘట్ట ములలోనికి విభజింపవచ్చును.

1. విష్ణుచిత్తుని కథ.
2. ఖాండిక్య కేశిధ్వజ వాదము.
3. యామునాచార్య చరిత్రము.
4. చండాల బ్రహ్మరాక్షస సంవాదము.
5. ఆముక్తమాల్యద చరిత్రము.

వీటి నన్నింటినిగురించి, తన వాగ్విశేష రచనాచాతుర్యమేపారగ, రసానుకూలముగ వసంత వర్ష శరదృతువుల వర్ణనలపెంచి, రాజనీతి యను పేరిట 84 పద్యములతో నాటికాలపు రాజనీతిని దేశ కాలానుసారముగా వర్ణించి, యేడాశ్వాస ములుగల ప్రబంధముగ గీర్వాణాంధ్రనికషోపలమ యనగ విద్వన్మణులు స్తుతింపపూరించెను. మాతృ కకు అముక్తమాల్యదకుగల మార్పులు రసానీరస ములకొంత చర్చింతము. మొదటి రెండవ ఘట్ట ములుకాక మిగిలిన మూడు ఘట్టములుగురించి

గ్రంథము పూర్తి చేయుటలో రాయలు తనకొక లక్ష్యము పెట్టుకొన్నాడు. ఈ ప్రచారమంతయు భక్తిమయమే కదా.

దీనిలో మూడు విధములగు భక్తి గలదు. యామునాచార్యునిది జ్ఞానసంబధమగు భక్తి. బ్రహ్మ రాక్షసునిది మూఢభక్తి. ఆముక్తమాల్యదది అనురాగపూరితమౌ భక్తి. కవితాకన్యక వశ్యంబగు భావ, వస్తు, రచనలలో భావమునకు భాషకు నెక్కువ ప్రాముఖ్యమిచ్చెను.

నంబూరి కేశవయ్యంగారు రచించిన ఆచార్య సూక్తిముక్తావళి(ఆఖవళూడుకొడుత్తాళ్) కాంధ్రానువాదము. అందులో పురవర్ణన మొక్క పదములో చేసెను. పురము పేరు పేర్కొనలేదు. కాని శ్రీరాయలు విలిబుత్తూరని నామమిడి దానిని 26 పద్యములలో రచించెను.

సీ॥ శ్రీమదంగోపాంగ శీర్షాన్వితామ్నాయ
        విద్వత్ప్రసాహస్ర విలసితంబు
    కమనీయరత్న సంకలిత కాంచనసౌధ
        మందిర ప్రాసాద సుందరంబు

పటహా కాళశంఖ భవ్యభేరీ వేణు
వీణామృదంగా నిస్సాణరవము

ఫలపుష్ప పల్లవ భరితమగు తరుపంక్తి
కలకంఠ శారికా కలరవంబు

రమ్య హర్మ్యాదిశోభిత రాజహంస
శాతిమనోహర పతిదేవతాంగనాఢ్య
మలరుధన్వ పురిరత్నమనుచు ననిచి
వాదభీకర గురుడనె మోదమలర.

విష్ణుచిత్తుని వర్ణన గనుడు. ఆచార్య సూక్తి
ముక్తావళి.

సీ॥ ఆ పట్టణమునందు, శ్రీపతితుల్యుండు
పరమ వైదికుడ నే బ్రాహ్మణుండు

మహానీయమగు జ్యేష్ఠ, మాసమునందున
స్వాతి తారయందు సకల వేద

మయుడైన శ్రీగరుత్మంతుని యంశము
చే బుట్టె నేవిష్ణు చిత్తసూరి

అమ్మహానుహాలుషు పరిష్కారాని పోలిక
జన్మ వైష్ణవుడయ్యె శౌరికృపను

అట్టి భట్టనాథుండు హరికి శేష
శేషతా కృత్యములందు శ్రేష్ఠమైన
దాస్య మెయ్యదియని మదిదలచెననుచు
వాది భీకర గురుడనె మోదమలర.

1. దీనికి లలితోద్యాన పరంపరా పికశుకా యను పద్యము.

2. దీనికి "సాయం కాలమునన్ మురజిత్" యను పద్యము.

3. దీనికి "సారది హస్తియులం" అనుపద్యము.

ఇంకను నాటి యాచార వ్యవహారములు ప్రతిబింబించునట్లు వర్ణన చేసెను. మూలము కన్న యెంత మెరుగుపెట్టెనో పఠించి యానందింపుడు.

దీని కాముక్తమాల్యదలో రాయలు

శా॥ అంచుంచున్ ద్వయపద్మపద్మ పదనుండ
ద్వంద్వ దశాగ్రింత యో

వర్షార్థ మష్టౌప్రయతేత మాసాన్
నిశార్థం దివసం యతేత
వార్ధక్యహేతో ర్వయసా న
వేన పరత్రహేతో రిహ జన్మనాచ.

దీనిని విని రాజు మోక్షమార్గ మరయుట గలదు. శ్రీరాములు చేసినమార్గే సమంజసమని తోచెడిని. వలన నాగవానునకు బోవు విషయము విషయసుఖాస్వాదలోలుపత్వము తెలుపును.

మూలములో విష్ణుచిత్తునికి శ్రీమన్నారాయణుడు స్వప్నమందగపడి మధురకేగుమని తెల్పెను కాని విష్ణుచిత్తీయములో విష్ణుచిత్తుడు వైష్ణవోత్తమునకు మాలిక వేయునపుడు మధురకేగుమని తెలిపినాడు. మూలములోని వచనము గనుడు. విష్ణుచిత్తునిగాంచి, "మహాత్మా నీవు మధురానగరమున కరిగి వల్లవదేవరాయని గని యమ్మహీపతి విద్వత్సభయందు బరపక్ష విక్షేపణ పూర్వకంబుగా సర్వవేదాంత ప్రతిపాదకంబైన పరతత్త్వంబును నిర్ణయించి స్వపక్షంబు స్థాపించి విద్యాశుల్కము హరింపుమని వచింపు" మ.న

సాతఁడు, "భక్తవత్సలా! సర్వవేదాంత ప్రతిపాద్య వేదశాస్త్రాధ్యయనాది జనిత జ్ఞానవాసనాహీనుండు" నగు నే నెట్లుపహరింతు ననగా నా శ్రీహరి జయమ్మగు నని భూమీభృత్సభకు పుఱగొల్పి భక్తశిరోమణిని పంపెను.

పద్యము హృద్యమగు భావమునకు ప్రధానంబు గావున శ్రీరాయలు చక్కని సిద్ధంపు సరస మృదుమధురమగు పలుకులతో రెండు పద్యములలో వాక్రుచ్చెను. "సర్వవేదాంతప్రతిపాద్య వేదశాస్త్రాధ్యయనాది జనిత జ్ఞానవాసనాహీను" డనుదానికి రెండు పద్యము లాముక్తములో గలవు.

శా. స్వామీ నన్ను నితఃపురా
పఠిత శాస్త్రగ్రంథ జాత్యంధునా
రామక్ష్మాఖననక్రియా ఖర
ఖనిత్రగ్రాహితోద్యత్కిణా
స్తోమాస్నిగ్ధకరున్ భవ
ద్భవనదాసు న్వాదిగా పంపుచో
భూమీభృత్సభ నోటమైన
నయశంబుల్మీకు గాకుండునే.

మ. గృహసమ్మార్జనమో, జలా
హరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికా
కరణమో, వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్ర
ధృతియో, ద్రాగ్దీపికారోపమో
స్పృహరీ వాదము నాకు లేర
యితరుల్ నీలీలకుం పాత్రముల్.

ఎంత మనోహరంబుగ వర్ణించెనో గనుడు. ఇంకను ఖాండిక్య, కేశధ్వజ సంవాదము, యమునా చార్య చరిత్రములు గీర్వాణ విష్ణుపురాణమునుండి గ్రహింపబడినవి. చండాల బ్రహ్మరాక్షస సంవాదము వరాహపురాణమునుండి గ్రహింపబడినది. ఆముక్తమాల్యదా చరిత్రలోని రసానీరసముల కొంత చర్చింతము.

ఆముక్తమాల్యదలో గోదాదేవి తులసి వనముదగ్గిర యరుగుమీద లభించినట్లు గలదు. కాని మూలములో జనకమహారాజునకు జానకి లభించిన స్థితినికి లభించినది. ఆముక్తమాల్యదలో

ఆముక్త మాల్యద భగవంతునికై సేయబడిన సౌరభభరితములైన ప్రసూనమాలలను ధరించు కొనుగడు. మూలములో దీనిని తెలిపికొని పెరి యాళ్వారగు విష్ణుచిత్తుడు మాధవునకు మాలికల సర్పింపక యుండిన సుముహూర్తమందే భక్తవత్స లుడు సన్నమందగపడి "భక్తశిరోమణీ! నీవు మాలలేల యర్పింపవైతివి. నీ తనయ ధరించిన వే మాకు పావనములు ఆమె శ్రీమహాలక్ష్మి యామె శ్రీరంగవాసస్థుని వలచియున్నది. ఆమెను శ్రీరంగ మునకు గొనిపోయి శ్రీరంగేశ్వరున కర్పింపుమనెను. కాని ఆముక్తమాల్యదలో భగవంతుడు విష్ణుచిత్తు లకు విష్ణుభక్తి ప్రతిపాదకమగు వరాహపురాణాంత ర్గతమగు చండాల బ్రహ్మరాక్షస సంవాదమును జెప్పెను. ఇంతియే భేదము. అయినను మిక్కిలి రసానుగుణముగ వర్ణించి ఆవంధ్రదౌరాగ్యమున కీర్తిశేషుడయ్యెను.

---

# 6

# కవనము.

చారిత్రక దృష్టితో గాకున్నను సారస్వత దృష్టితో శ్రీరాయలు మనకు చిరస్మరణీయు డదియునుగాక కవిసృష్టి బ్రహ్మసృష్టికన్న విలక్షణ మని కదా మన లాక్షణికులు వచించిరి. షెలీకవి **Poets are unacknowledged legsilators of the world** అని యుల్లేఖించెను. శ్రీరాయలు నాటికాలపు రాజనీతిని రాజనీతియను పేరుపెట్టి 84 హృద్యపద్యములగల యొక ఘట్టమును జొప్పించెను. శ్రీనాథు డొక్కడే దేశకాల పాత్రాదుల ననుసరించి పురవర్ణనాదుల గావించె. దానిని గాంచియె రాయలాముక్తమందు విద్యానగర విభవమంత యుట్టిపడునట్లు పురవర్ణనాధుల నతి ప్రతిభతో గావించియున్నాడు. ఏతద్గ్రంథ ప్రౌఢిమ పరికింపవలెనన్న కవనముకూడ యించుక పరికింప వలెను. ఆంధ్ర వాఙ్మయమున రెండె మహాకావ్యములు. మొదటిది భట్టహర్షుని గీర్వాణ నైషధమున కాంధ్రానువాదమగు శ్రీనాథ కవిసార్వభౌముని శృంగారనైషధము, రెండవది శ్రీరాయల

విష్ణుచిత్తీయము. వీనిలో పగముకన్న యెక్కువ సంస్కృతము వాడబడి యున్నది. శ్రీనాథుడు కవిసార్వభౌము డైనను యాత డాంధ్రీకరణమందె స్వేచ్ఛమార్గ మవలంబించెను. ఈతడు సంస్కృత సమాసాలను నాంధ్రమున కీడ్చెను. కాని యీ సంస్కృతసమాస పదభూయిష్టమందుకూడ మధురత్వము కలదు. స్వకీయ కల్పనా రచనా చాతుర్యములకు రాయని దే యగ్రహస్తమని చెప్పకతప్పదు. దిట్టకవి యనిపించుకొన్న రామకృష్ణుడుకూడ పదగుంభనంబుతో కావ్యంబునల్లినాడు. ప్రతికవియును తన కవిత్వరీతిని గ్రింథాదిని పేర్కొనును. శ్రీహర్షుడుగూడ "గ్రంథిగ్రన్థి" యను శ్లోకమున బేర్కొనినాడు రాయలీ పద్యమున తెలిపియున్నాడు.

సీ॥ పలికితు త్ప్రేక్షోపమలు జాతిపెంపెక్క
రసికులౌ ననసుదాసల చరిత్ర

భావధ్వని వ్యంగ్యసేవధిగాగ జె
ప్పితిని సత్యావధూ ప్రీణనంబు

శ్రుతిపురాణోప సంహితలేర్చికూర్చితి
సకలకథాసార సంగ్రహంబు

శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగరచించితి సూక్తి
నైపుణీజ్ఞాన చింతామణీకృతి

మరియు రసమంజరీముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
ఆంధ్రభాష యసాధ్యంబె యందునొక్క
కృతివినిర్మింపుమిక మాకు ప్రియముగాక.

దీనినిబట్టిచూడ యీతడు గీర్వాణ కావ్యములు వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. కాని వీనిలో కొన్ని కానవచ్చుటలేదు. సత్యావధూప్రీణనము దొరికినదని వేదమువారు, జాంబవతీపరిణయము దొరికినదని భావరాజు కృష్ణారావు గారును, సకల కథాసార సంగ్రహము దొరికినదని వేటూరువారును, ప్రత్యేక వ్యాసరాజములద్వారా తెల్పిరి. ఏదియెట్లున్నను యీతని కవిత నలంకార యుక్తముగను, రెండవ చరణమువల్ల భావధ్వని వ్యంగ్యప్రధానముగను, వినువారికి పాపహారంబుగ నుండుననియు, వేదముల నీతివిశేషముతో రాజిల్లుచున్నదనియు తెలియవచ్చెడిని. ధ్వని ర్గుణీభూతం వ్యంగ్యమ్ కావ్యమ్ ఉత్తమమ్ యను నలంకారికుల

పలుకునుగూడ యీ గ్రంథము సార్థకముచేయుచు న్నది. వేదమునందలి వాక్యములకు సంబంధ ముండునట్లు కావ్యమల్లినాడు. పాపహారంబుగను కూడ వున్నది. ఏలన సీతను వ్రాసినది పరమ భాగ వత చరిత్రియేకదా! దీనికి నామాంతరము విష్ణు చిత్తీయమనియేకదా విష్ణుకథలు వినువారలకు పాపములు "నలినీదళం నకుర్వంతి మంభసా" యనురీతి నంటవనిగదా శ్రీ తున్నా రాయణుండు వాక్రుచ్చినది. మధురమగు శైలిలో వ్రాసెనను టకు యీ పద్యముదాహరణము.

మ॥ లలితోద్యాన పరంపరా
పికశుకాలాప ప్రతిధ్వానము
లల్వాభీ నీలహారిన్మణీ
పికశుకస్వానభ్రమంబూన్ప మి
న్నులతోరాయు సువర్ణసౌ
ధముల నెందుంజూడ జెన్నొందు శ్రీ
విలిబుత్తూరు సెలంగు పాం
డ్యనగరోర్వీరత్న సీమంతమై.

ఇందులోని పాండ్యనగరోర్వీ రత్నసీమం తమై యనునది కడుంగడు సుధా మధురారస

ధారల నొల్కుచున్నయది. ఇందె "నేడు మహామతీ" యని శ్రీమన్నారాయణుడు వ్రాసిచ్చిన పద్యముకూడ సుధారసము జిప్పిలిచున్నది. ఈతని కవన మలంకారయుక్తము గనున్నదనుట కెన్నియో పద్యము లుదాహృతములు. మొదటిది విలిబుత్తూరువర్ణన. దీనిలో భ్రాంతిమదలంకారము ఇంక నీ గ్రంథము ధ్వనిప్రాధాన్యమ్ కావ్యమ్ ఉత్తమమ్ అనుదానికి చక్కని యుదాహరణము౦ జూడుడు.

మ॥ తరణుల్ తల్లియొరంగు చం
బులును పందచ్చైత్యముల్ దీ
ములై పెరశేపం జనుదెంచి
గాక రవిదీప్తిం గుర్రింగి పాతా
ళ గహ్వారముల్ తూరిన వా
రి నీ యుతుకు తారాళ్ళా తెచ్చు
వా దీర్ఘ తచ్ఛిర కృష్టింగనునట్టి
శైత్య మలరించె నూతులందత్తరిన్.

ఇందు కవి చెప్పదలచిన విషయమొకటి వ్రాసిన దొక్కటి. దీనిలో గ్రీష్మమును వర్ణించుచు భర్తలు భార్యలతో సుఖించుటకై ప్రచండ

మార్తాండుని కిరణములైనను నోర్చి వత్తురని వ్యంగ్యముగ చెప్పెను. ఇట్టివింక చాలగలవు. వాటిని పాఠకమహాశయులే గ్రంథపఠనవల్ల తెలిసి కొందురుగాత. దీనిలో వేదవాక్యములుకూడ వున్నవని చెప్పితిని. అందుకుదాహరణము:,

క. చంపకు చమువుల మేముప
శింపని శాస్త్రములె మాపఠింపని శ్రుతులే
యింప నవి, నమ్మనే "ప్రథ" మాం
పిబ తే వహ్నియనెడి మాటవుగాదే.

ఈ వాక్యము దేవీపురాణములోనిది. ఇంకను నుపనిషద్వాక్యంబులున్నవి. విష్ణుచిత్తుడు స్వమతస్థాపన చేయుచు "సయేష సర్వభూతాన్త రాత్మా పీహతపాప్మాదివ్యా దేవ ఏకోనారా యణాః" యను వాక్యంబుల వాదఘట్టములో ప్రయోగించెను. ఇంతటి గాఢబంధదము శ్రీనాథుని యందు గానము. దానికుదాహరణము కాశీ ఖండము.

సీ. దోర్దండఘట్టనత్రుటితగ్రవగ్రావ,
ఘూళపాళమిళి ద్యుస్థ్రలములు -

ధ్వజపటపల్లవోద్ధత మరుత్సంపాత
పరికంప మానోచ్చ పరివృక్షములు

గ్రాసాభిలాషానుగత విధుంతుదప్రసః
త్రస్త చక్రవ్యథోపద్రవములు

శ్రాంతాశ్వసిబిడనిశ్వాస ధారాధుత
స్వర్ధునీనిర్ఝరీ జలచరములు

గగనపదలంఘనైవ జాంఘూలికములు
పద్మవన బాంధవుని రథపరిస్థితములు
సాగెనది దక్షిణాయన సమయమగుట
దద్దురము మోదమలయ భూధరముమీద.

దీనికంటె నెక్కువ కాఠిన్యముతో నుచ్చా దించుటకును నాతికష్టతరమగు దశావతారస్తవమున "స్యందనస్థితబిడౌజః" యను పద్యమును వ్రాసెను.

# కవనము-పాకము.

శ్రీ రాయలను సాహితీపటిమలో నాచన సోమునికి పోల్పవచ్చును. శ్రీ రాయలు రచించిన "చనికాంచెఁ విరజాభి" యనుదానికి సోము డుత్తర హరివంశమందీ క్రిందిపద్యము రచించినాడు.

"గాండీవారావ ఝుంఝాఘటిత భయది శాకః పురాతః పురంధ్రీ గండాభోగ శ్రమాంభః కణకలుషిత గంగా తరంగాభిషంగా ఖండాన్మ త్యాండ పాళీ కబళిత సకలక్ష్మాలోకాశ సీమానిశాం తోద్దండా తిక్రాంత గర్వాంత యుమాభట సంతా నముంగానన్ లైతిన్" ఇంక ప్రథమమున సగము కన్న నెక్కువ సంస్కృతము వాడియుండెనని యుల్లేఖించియుంటిని. అందుల కుదాహరణమున కీ పద్యముల తిలకింపుడు.

శా. అద్ధా దాగ్విబుధమ్మహోవచః
కవ్యాహార మహోవచ
స్సిద్ధమ్మాః కృతాతాం గతః
కలిరితి శ్రీసూక్తి విద్యాధర

మిస్త్రద్ధా ధత్యమగాల్లయుం
హింకుధియా మిద్ధం వదత్కిన్నర
మ్మృద్ధీ రాగ్రణి గెల్పు టుత్సవము
నందయ్యె న్నభమ్మంతయుఁ.

శా॥ కాంచెన్ వైష్ణవుడర్ధయోజన
జటాఘూటోత్త శాఖోప శా
ఖాంచద్ఘూటచరన్మరుత్త్రయ దవీయః
ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కోట కృతవ్రణచ్ఛల
నలిప్యాపాది తాధ్యాన్య ని
ప్పంచారోత్త మహాఫలోపమ
ఫలస్ఫాయద్వటమ్మాజముఁ.

మ॥ చనికాంచెన్ విరజాభిధాం
తరవపుస్పహోద్యద్భవాతీర సం
దనవాటీ విలయద్రుమావళీ
దళాంతర్ద్రశ్య హాపాళిభం
జనచాంపేయ సుమాయమాన
విషమస్వర్ణావృతిప్రాత ర

శ్రీనభస్స్పృక్ఛిఖరాతిదీపకళికా
శృంగంబు శ్రీరంగమున్.

ఈ పద్యము లెంత సంస్కృత ప్రౌఢదీర్ఘ సమాస ఘటితంబుగనున్నవో పరికింపుడు. ఎట్లయి నను గ్రంథము ప్రౌఢవాక్యాపేటమైన శైలితో సలరారుచున్నది. పాషాణకల్పకము, నారికేళ పాకము అని పాకములు రెండు.

ద్రాక్షాపాకోభవేత్సో
యం బహిరన్తః స్ఫురద్రసః
బహిః ఖరోనారికేళ
పాకస్త్వన్తస్సదుర్భవేత్.

(సాహిత్యరత్నాకరము)

ఇందు చదువంగనె యర్థమగునది ద్రాక్షా పాకము. దాని కుదాహరణములు మనుచరిత్ర పారిజాతములు. పైకి నాతి కఠినముగనుండి లోపలి యర్థము మృదుమధురముగా నుండునది నారికేళ పాకము. దీని కుదాహరణములు ఆముక్తమా ల్యదా నైషధాదులు. పాకమన నేమి? అర్థభావ గాంభీర్యమే పాక మనంబడును. పైకి చదివిన

యెంత శీర్ష వేదన జనించినను యర్థము తెలిసికొను యోపిక మనకుండెనేని మనము కావ్యరసైకలోలు గమై యెందమం దానందసందోహ నిష్యంద పారావార తరంగ భంగడోలికలలో తేలియాడుదుము! అదియేకదా మంచి కావ్యలక్షణము; ఎట్లు భోజుడు తనకుగల గీర్వాణ వాఙ్మయ సర్వజ్ఞత్వమును చంపూరామాయణములో ప్రకటించెనో తద్వతే శ్రీరాయలు తనకు గీర్వాణాంధ్ర వాఙ్మయము లందుగల యఖండ విద్యాప్రావీణ్య వైదగ్ధ్య శిల్పంబు లాముక్తములో యెల్లరకును తేల్లము గావించినాడు. వేయేల ఆముక్తమాల్యద గీర్వాణాంధ్ర నికషోపలమ యని నొక్కివక్కాణించుటకు నేను సాహసించుచున్నాడను. వేదము వేంకట రాయశాస్త్రిగారు ఆముక్తముపై నిచ్చిన యభిప్రాయం బొకించుక వీక్షింపుడు. "శ్రీరాయలకు గీర్వాణాంధ్రాది కావ్యాది వాఙ్మయమెల్ల జిహ్వాగ్రగతము. సంస్కృతశబ్దశాస్త్ర పాండిత్యం బపారంబు. ఇమిడికకు బిగువున కాంధ్రవాఙ్మయము లోనిది యగ్రగణ్యము. ఆశ్వాసాంత పద్యములు పద్యాంతంబు లసమానములు"

ఈతని కవిత్వములో యచ్చటచ్చట మాధుర్య ప్రసాద కావ్యగుణంబులు కానవచ్చెడిని. అందు ఓజోగుణముకూడ కలదు. మాధుర్య ప్రసాద కావ్యగుణములకు

చ. విను మొకమాట రాత్రిచర వే
 గిర మేటికినిన్ జయింతు రే
 అనిమిషులైన భాజనతాన్నము నే
 నిక నెందుబోయెదన్
 ఔనగక ప్రాణరక్షణము
 పేక్ష యొనర్చుట పాపమింద్రుకై
 కనలకు నాకు మేనియెడ కాం
 క్షయు లేదిది పోవు శ్రేయసుగ్.

సుకుమార కావ్యగుణమునకు "వెలది యీదండ వెల యెంత?" యనుపద్య ముదాహృతము. ఓజోగుణమునకు "కాంచెన్వైష్ణవు" డనుపద్య ముదాహరణము. అందందు శ్లేష గాన్పించెడిని. అందులకు దాహరణము

శా. అప్పుల్వారిధి చేతబుచ్చికొని
 కార్యంబైన మున్గొన్న య

య్యాప్త ర్థాచనియు ప
ప్రద్రికముగా నవ్యార్థికే తీర్పగా

నప్పుణ్యాతి విశుద్ధజీవుడు ని
జాచ్ఛాంగంబులం దోచు న

ట్లాప్పార్కెన్ శశిబింబ గ
ర్భితముల్తై దర్వ్యాచారశుభ్రాభ్రముల్.

గాడియను శాస్త్రికి "కాంచెన్ నైషధ దర్శయోజన" యనుపద్య ముదాహృతము. భక్తి హర్షుని గీర్వాణ నైషధము నారికేళపాకములో గలదు. ఆతడు తన గ్రంథములో ముడుకల పెట్టినో యాతడు గ్రంథాదిని నుల్లేఖించియున్నాడు. శ్రీహర్షుని సూక్తిని గనుడు.

"గ్రన్థం గ్రన్థిరిహ క్వచిత్క్వచి
దపిన్యాసి ప్రయత్నాన్మయా

ప్రాజ్ఞంమన్యమనాహఠేన
పఠితీ మాస్మిన్ ఖలః ఖేలతు

శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత
దృఢగ్రన్థిః సమాసాదయా

నిర్మల మనఃస్థైర్యమునకు, సుజ్ఞానార్జనమునకు యీ కవి గ్రంథ మొకటే యాధారము. కావున మాన మెల్ల రాముక్తమాల్యద చదువుటొప్పు. శ్రీ రాజు ఉమాకాంతవిద్యాశేఖరులవా రాముక్తమాల్యదలో దోషము లున్నవని వచించిరి. కాని వాటిని "ప్రమాదో ధీమతా మపి" యని మన్నింప వలెను. ఆద లాక్షణికుల "కావ్యం కాంతా సమ్మిత తయోపదేశ యుజే" యనుడానికి ప్రతిపద సార్థకము జేయుచున్నది. రాయలు మంచి ప్రకృతి శాస్త్రవేత్త. పల్లెటూరి జీవితముల చిత్రించినాడు. ఈతడు సార్వకాలీన మహాకవి. ఈతడు పద్యముల తూగుకుగాని, శబ్దార్థఘటిమల కెవ్వనికి తీసిపోడు. వేయేల సీతసి కవిత యీ క్రింది పద్యమును ప్రతి పదసార్థకము చేయుచున్నది.

మ. పదలాలిత్యము, వర్ణశుద్ధి
యును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పదభావంబును రాజ్యయోగ్య
తయు దోషస్ఫూర్తిరాహిత్యమున్

పదలంకార విశేషము్ గలిగి
విశ్వప్రాణ సౌభాగ్య సం
పదమై తేజముపోలి గ్రాలు
వలచా పద్యంబు హృద్యస్థితిన్.

ఇంక దీనిలోని సాహిత్యమును, రసమును కొంత చెప్పెంతము.



# 8

# సాహిత్యము-రసము

## నాటి విజ్ఞానము.

ఇందలి సలక్షణమైన గ్రాంధిక భాష నేటి వలె వ్యావహారిక భాష గాక సిద్ధంపు ముద్దులొలుకు జిలిబిలి పలుకులతో సలరారుచున్నది. ఇది యెటువు ప్రబంధమైనను యందందు వాఙ్మాధుర్యం బొప్ప నిదము లందందు గాన్పించెడిని. స్వార్థ కారసం

ధులు, అర్థసంధులే యిందలి దోషములు, భావానుగుణమగు భాష, భాషానుగుణమగు రచన ప్రశంసనీయము.

పూర్వమాంధ్ర భాషయన్న గీర్వాణాంధ్ర సమ్మిళితమనియే వారి యభిప్రాయము. తెనుగులో వ్రాతునని గీర్వాణాంధ్ర వాక్ప్రౌఢిమలు పొదలగ వ్రాసినాడు. దీనికి సాహిత్యమందున్న స్థాన మింతింతని చెప్పనలవికాదు. పలనన దేశీయ పదప్రయోగములు, క్రొత్త పోకడలు, వర్ణన లిందుగలవు.

రాయల కాలమునుండియే ప్రబంధ యుగ మారంభమైనది గనుక ప్రబంధము లన్నిటిలో ఆముక్తమాల్యద ప్రౌఢప్రబంధమై యొప్పారుచున్నది. అజనజాతీయములుకూడ యందందు గన్పట్టుచున్నవి. శ్రీనాథుని నుడికారపు పెంపు లోకోక్తుల పొదిగింపుడుకూడ యాతనికి కుదిరినది. కాని వాటిని వ్యాసవిస్తరభీతిచే నుదహరింపనైతిని.

రసములు ముఖ్యముగా పది. కాని కొందఱు రసములు తొమ్మిదని వాదించుచున్నారు. ఈ

గ్రంథమందు భక్తి, రౌద్రము, వీరము, భీభత్సము, అద్భుతము, శృంగారములు అభివర్ణితములైనవి.

భక్తికి "గృహసమ్మార్జనమో"; శృంగారమునకు "వాతెరతొంటికైవడి"; రౌద్రమునకు "ధనధాన్యద్విరదాశ్వ"; భీభత్సమునకు "ఎల నీటి బొండెంబులు"; ఇత్యాదు లుదాహృతములు.

ఆముక్తమాల్యదలో పవిత్రమైన శృంగారమభివర్ణితము. పోతనామాత్యుడు రుక్మిణీ కళ్యాణ యిత్యాది ఘట్టములలో చేసినట్లు, ఆముక్తమాల్యదలో ఆముక్తమాల్యద విరహము భగవంతునిపైనున్న అనురాగపూరిత భక్తిని ప్రకటించెడిని. అదియే పవిత్రశృంగారము, భగవంతుడు గోదాదేవిని తనలో నైక్యము చేసుకొనునప్పుడు సంభోగ శృంగారము కలదు.

కావ్యమున కఖండత్వమును కల్గించునది నాయకాశ్రయమైన రసమని సాహిత్యవేత్తలు సిద్ధాంతీకరించిరి. ఈ రసము నాయకునియందే యభివ్యక్తమగుచున్నది. పాఠకుడా రసాస్వాదన చేయుచున్నాడు. దృశ్యకావ్యమున పాఠకుడు

దృశ్యరూపేణ యనుభవించుచున్నాడు. శ్రవ్యకావ్యముః శ న కు తా నే యనుభవించుచున్నాడు. ఆముక్తమాల్యద నిశ్చయముగ, నిస్సందేహముగ నిశ్శంకాస్పదముగ కావ్యమే. ప్రధానరసము భక్తి, అంగి శృంగారము. విష్ణుచిత్తుఃకథ ప్రధాన కథ. యాతడు సంపూర్ణ భక్తిస్వరూపుడు. ఆతని భక్తికే మెచ్చి శ్రీమన్నారాయణుడు కూతునొసంగినాడు. ఆమెను మరల శ్రీహరియే యర్పించి యల్లునిగా జేసుకొనియె. ఆముక్తమాల్యద చరిత్రయే శృంగారరసపూరిత మయినది. ప్రధానరసము భక్తి అంగిరసము శృంగారము.)

# 9

# నాటిసంస్కృతి

# కృష్ణరాయల చరిత్రము

మనకు పంస్కృతిచరిత్రయే లేదు. దానికి సమగ్రాధికార చరిత్ర వ్రాయబడలేదు. ఎప్పుడు రచి

యింపబడునో మనము నిశ్చయముగా తెలుప జాలము. కాని ఈ సంస్కృతి కొంతకొంత పూర్వ కవుల కావ్యములయందు సాహిత్యదర్పణములందు కొంతవఱకు ప్రతిబింబించును. కావుననే షేక్స్పియరు కావ్యము ప్రకృతికి ముకురమేయని వచించెను. ఇది కొంతవఱకే సమంజసము. కృష్ణరాయల కాలసంస్కృతి కొంత ఆముక్తమాల్యదలో ప్రతిబింబించి యున్నది. తత్కాల సాంఘికాచార వ్యవహారాదుల తెల్పుటకేతదుద్గ్రంథరాజ మొక్కటే కాదు, యింకను మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతములు తోడ్పడవలెను.

కాకతీయులకాలములో శైవమతమెక్కువప్రచారములో నుండెను. కాని శ్రీరాయలకాలము వచ్చునప్పటికి శైవమతస్థానమును వైష్ణవమత మలంకరించినది. రాజులు సాహిత్యప్రియులైరి. స్వభాషానురాగము పొటమరించినది. సంస్కృతాంధ్ర నిఘంటువులగు గ్రంథములకు నాడు యెక్కువ ప్రచారముండెనిది. నాడు కావ్యములు భాషాజ్ఞాన మవశ్యకమను దృష్టితో సాహిత్యాభిమాను లాదరించుచుండిరి. ప్రభువులుకూడ భోగలాలసులై కవులై

సద్గోష్ఠీలోలురై వాగ్వ్యాసంబుల గావించుచుం డిరి. రామకృష్ణ కవిసాంగ్రుడు నాటి బిరుసు వాఙ్మయ విమర్శకుడై యలరారుచుండెను. రాజులు నేటివలె Divide are Rule విధించి పాలింపుమను న్యాయము ననుసరింపకయే పాలించుచుం డిరి. శ్రీరామచంద్రుని పగిది పరిపరిశోధనార్థ మరిగుచు చారులవలన (C. I. D.) శత్రురాజుల సన్నాహముల తెలిసికొనుచు, "రాజానాం బహు వల్లభః" అను నా భాషణమును ప్రతిపదసార్థకము చేయుచు సాధుజనసమ్మతులై బ్రాహ్మణసమ్మ తులై పాలించుచుండెను. నాడు విజయనగరము మహోన్నత రమ్యహర్మ్యములతో నలరారుచుండె డిది. విద్యానగరము వైజయంతికముల మించు ప్రాసా దములతో ద్రవిడాంగనల చతురపరిహాస విలాసో క్తులతో, కవయిత్రులగు వేశ్యల విలాసములతో దేవేంద్రాది యాస్థానముల ధిక్కరించెడి కొలువు కూటములతో, ఆస్థాన విద్వాంసుల వాగ్వాదముల సంధానవ్యాపములతో నలరారుచుండెడిది. నాటివారలు సంతతము శ్రీమన్నారాయణుని పాదారవిందకందళితాంతరంగులై యనవరత మహాత్మనిసన్నిధి జేయుటే పరమధర్మమని యెంచు

చుండెడివారలు. పుష్పలావికలు పూవులమ్ముచు విటుల విభ్రమముగ నొందజేయుచుండి వర్తకము యెక్కువగా ప్రబలియుండెను. విప్రోత్తముల వేద వాక్యములకు కొంత గౌరవముండెను. వేయేల వైష్ణవులకు యమునార్యశేఖరుల సగ్రహారములు సాగడిగిన సీమలో కృష్ణరాయ లిచ్చిననులలో యేమియును సందియము లేదు. భక్తవత్సలుడు భక్త శిరోమణులకు సూక్తినైపుణి ముక్తిభుక్తి యిచ్చు చుండిరి. నాటివారలు (సూత్రులు) చాపలు యిత్యాది వస్తువులను భక్ష్యభోజ్య చోష్యలేహ్యా దులగా నెంచుచుండిరి. ప్రతివారును తమ కర్మల నిర్వర్తించుచుండిరి. బ్రాహ్మణ్యమున్న యానా డున్న గౌరవమింతంతని చెప్పశక్యముగునా! భక్త లకు దాసుడై శ్రీమన్నారాయణుడు వారికి యూడిగములు చేయుచుండెడివాడు. జ్యోతిష మునకు నట్టి నమ్మకములుండెను. వేదాంతజ్ఞానమువల్ల రాజసభలలో విద్వాంసులు వివిధమత స్థాపవాదము గావించుచుండిరి. సర్వం విష్ణుమయమ్ జగత్ యనా డెల్లెడలను తెల్లమైయుండెను.

జొంచెలికూర బొరంటినూనియలతో వండి భక్షించుచుండిరి. రాజనీతి యెక్కువ ప్రబలియుం

చేయుటయో యిత్యాదులే, ఆనాడు కూడ
యీనాటికంటె యెక్కుడు నాగరికములు ఆచార
ములుండెను. భగవంతునియందు దప్పనై యింకను
నమ్మకము లడుగంటనేలేదు. వేయేల ఆముక్త
మందు వైష్ణవోత్సవముల గొడుగుపట్టులు, దేవ
లోభగ్నము, రాజనీతి, ఎలనీటి బొండెములను పేర
సమ్మబడు లేత కొబ్బరికాయలు, యుద్యాలతోరు
వులలోని ప్రసూనమంజరులు, విద్యానగర సౌంద
ర్యము, వైష్ణవుల కింపగు నీరుమజ్జిగలు, బ్రాహ్మ
ణసంతర్పణలు, వైష్ణవుల మంగళస్నానములు,
రాజుల చేష్టలు, విద్వాంసుల ప్రవృత్తులు, వివిధాగ
హారములందలి విచిత్రచర్యలు, ద్రావిడాంగనల
చతురపరిహాస విలాసోక్తులు, భోజనములందుప
యోగింపబడు శాకపాకములు అచ్చుగ్రుద్దినట్లు
వర్ణింపబడినవి.

ఇంకకొంత కృష్ణరాయల చరిత్రము పరిశీ
లింతము. కృష్ణరాయలను దాసీపుత్రు డందురు.
కాని యిట్లయినను యేతద్గ్రంథము వ్రాయుట
బట్టి యీతడు తరించి విష్ణుభక్తుడై విష్ణుసాయుజ్య
మును పొందియుండెనని సిద్ధాంతీకరించవలసివున్నది.

అతనికి స్వప్నమువచ్చినదని చెప్పుటచే శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించియుండనోపు నని తప్పని నొప్పించుట యెవ్వరికొప్పును? అట్లుచేయ సాహసించువాడెవ్వడు? కృష్ణరాయలు నాస్తికపుత్రుడనుట కేగ్రంథమునం దేనియు ప్రజల పరిశ్రుతప్రమాణము లేదు. శ్రీరాయలు మంచి పరిష్కృతి శాస్త్రవేత్త, వేదవేదాంగ పారంగతుడు. వైష్ణవమత పక్షపాతి, జ్యోతిష్కుడు, గీర్వాణాంధ్రభాషలం దఖండప్రజ్ఞ నార్జించుటేగాక యేతద్దేశ్యనానా భాషలందు గూడ గొప్పకవియైయుండెననుట తప్పక నొప్పుల కుప్పలందఱ కొప్పగునట్లు తెలియును.

# 10

# సంఘట్టనా సంవిధానము — వర్ణనలు

## కథావలి సంఘట్టనలు 5

1. విష్ణుచిత్తుని కథ. 2. ఖాండిక్య కేశిధ్వజ వాదము. 3. యామునాచార్య చరిత్రము, 4. చండాల బ్రహ్మరాక్షస సంవాదము, 5. ఆముక్తమాల్యద.

# విష్ణుచిత్తుని కథ.

ఇంక పైవాని పైవక్ష్యమాణ విషయమున కొంత ప్రశంసనావేశము. విష్ణుచిత్తుని కథయే ఈ గ్రంథమునకు మూలాధారము కావున నే తద్గ్రంథమునకు విష్ణుచిత్తీయమని నామాంతరము కలదు. ఈ విష్ణుచిత్తుని కథకు మూలమును దానికిని దీనికిని మార్పులు ప్రథమముననే చెప్పియుంటిని. విష్ణుచిత్తుడు భక్తిపరుడయ్యును న్యాయార్జిత విత్తమున వైష్ణవోత్తములకు అతిథి సత్కారపూజాదుల నాచరించెనే కాని యన్యాయార్జిత ధనమునగాదు. అతడు నిరాడంబరజీవి. షడ్రసోపేతమయిన భోజనములు పెట్టుచు కృపయా భోక్తవ్యమని వైష్ణవోత్తములను ప్రార్థించినాడు. ఆత్మస్తుతి గొప్పవారలకసమ్మతముగదా! ఇతడు పూర్వజన్మ సంస్కారమువల్ల సకలవేద యుపనిష ద్రహస్యములు నెఱింగియు శ్రీమన్నారాయణునితో "ఆరామత్రా ఖనన క్రియా ఖరఖనిత్రాగ్రహింస్రో ద్ధృతక్రిమిస్తోమా స్వీకరః" అని చెప్పుచున్నాడు. అదియును రాజసభలో జనులత్యాశ్చర్య మొందునట్లుగా వైష్ణవమతస్థాపన చేసినాడు. తనకు

జంగాముకలిగినదని గర్వపడి యజ్ఞభక్తిని నాశనమేసు. తొంటికంటె యెక్కుడు భక్తితో మెలగుచుండి శ్రీమన్నారాయణుడే వానిని భక్తికలరి శ్రీదేవితో సహితో గెల్పింతు ని వచించినాడు. ఇట్లు విష్ణుచిత్తుని భక్తి తుదకు పరవశము జెందు నారాయణుని అల్లునిగా జేసుకొన్న మహామహుండు.

# 11

## ఖాండిక్య కేశిధ్వజ వాదము.

ఈ ఖాండిక్య కేశిధ్వజ వాదము విష్ణు పురాణమునుండి గ్రహింపబడినది. వెన్నెలకంటె యెక్కువ రసవత్తరముగ రాములు రచించినాడు. దీనిని వైష్ణవమతస్థాపన చేసి విష్ణుచిత్తుడు వైష్ణవ మత ప్రాబల్యము చెప్పుటకీ వాదమును జొప్పించినాడు. ఈ ఖాండిక్య కేశిధ్వజ వాదమును రచించుటలో గొప్పనేర్పు జూపించినాడు. ఈ ఘట్టమందు కొన్ని విషయములు ప్రత్యక్షముగ నున్నటుల

వర్ణించినాడు. అట్టుచేయు టెంత గొప్పకార్యమో పరిశ్రమశాలులకే వ్యక్తమగును. ఇందు యజ్ఞగవి వ్యాఘ్రఘూర్ణమైన మహాగర్తమునందే బాలుడు వెళ్ళఁజేసి చెప్పిన పద్య మెంతో హృద్యసద్యఃప్రేరితమై యున్నది. దానిని దిలకింపుడు.

ఉ॥ గబ్బుపమత్త్రికంబయి మెఱుం
గంబడు నన్దరు పర్ణముల్పడిన్
ద్రొబ్బుచు గార్త్రగిళ్ళరో
దత్తో బురిగించెను బొబ్బింతగా
డుబ్బిలి సంజ్ఞగాగ జెవు
లూదిన వల్లవు దుర్విఘూలగా
పెబ్బులి గొంతు కోల్గఱచి
పిల్లుని మార్మ్రెడ ద్రెళ్ళదాలుచుఁ.

ఈ పద్యభావము యథార్థముగ పరీక్షితముగ నున్నది. కేశిధ్వజుడు ఖాండిక్యునకు వేదాంత ముపన్యసించు పట్టుమకూడ నాతి రసాత్మక సహృదయాహ్లాదకరముగనున్నది. ఖాండిక్యునకు రాజ్యము వేడుటకు కారణము చెప్పు పద్యమెంతో హృద్యముగ నున్నది.

మ॥ విను కేశిధ్వజ ధాత్రివేడమికి
నావేదించెదన్ హేతు వ
జ్ఞానకుంగాక వివేకి కేవల జ
నియించున్ లౌల్యమొందుకారణం
బున బాడిన్ రిపుగెల్చువాడియు
ప్రజాపోషంబు ధర్మంబురా
జున కౌనైన నశక్తుత్వద్విజిత
రాజ్యాన్న న్నఘుంబంటునే.

ఇట్లే యీ ఘట్టమంతయు రత్నమయమై యలరారు చున్నది. ఇంక కొంత వేదాంత ఘట్టమును పరికింతము. భావనాత్రయ స్వరూపమెంతో హృద్యముగ వ్రాసినాడు.

ఆ॥ ప్రాణికోటికెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు
విషయ సంగియైన విను బంధకారి ని
ర్విషయమైన ముక్తి విభవకారి॥

అదియునుగాక శ్రీమన్నారాయణుని స్థూలరూపమెట్లు వర్ణించి చెప్పెనో గనుడు.

సీ॥ శరదిందు చారుచక్ర స్మయాజిత్ప్రసన్నాస్యు
దొడ్డ కెంపమ్ము కందోయివాని
నతికమ్ము గల్లభాగాభోగ పాలాఢ్యు
ముకరాంకరత్న కర్ణికలవాని
గాంబవోద్యచ్ఛ్రీడింబన్నత శిరోధ
సిరిపొల్పు మచ్చ పేరురమువాని
నతనాభిముఖ వళిత్రితయ శాతోదరు
జానులంబి చతుర్భుజములవాని

గిరి కరకరోరు, రుచిర జంఘానవోజ్జ్వ
పనుబొందిన పద పల్లవములవాని
హైమనవను గిరీట హారాంగదాది
కలితు శంఖ రథాంగాదు లలరువాని.

# 12

# యామునాచార్య చరిత్రము.

యామునాచార్య చరిత్రము జ్ఞానసంబంధ ముగు భక్తిని ప్రకటించును. యామునాచార్య

చరిత్ర కూర్చుటలో దేశకాలాదిపాత్రానుగుణముగ మార్పులు గావింపబడినది. అయినను నవసరమే. మూలము [మూడును వారివారి శ్రీమహాభక్తవిజయము] అందు యామునుడు 10 ఏండ్లలోనే అష్టాదశ విద్యలందు సమాన పండితుడు. అతడు రాజసభలోనికి ప్రవేశింపజేసిన వాని గురువు. కాని దీనిలో యితనికి రాజదర్శనము రాజమహిషిద్వారా కలిగినది. అదిగాక రాజు దీనిలో శైవుడు, విష్ణుమత పక్షపాతి శివుని పూజించని వానికే యాగ్రహము లిచ్చును. విష్ణుభక్తులను తన కొలువుకూటమునకు రానివ్వడు. విష్ణువనిన మండిపడును. విష్ణుభక్తుల నానావిధముల హింసించుచున్నాడు. కాని మూలములో యేమాత్రము పేర్కొనబడలేదు. ఇది యంతయు శ్రీరాయల మార్పే. రాజు రాజమహిషులు చేసుకొన్న ప్రతిజ్ఞ లాకిటుగాని వాదములు భిన్నములు.

మూలములో నిట్లుగలదు. రాజసభాస్థలిలో విద్వాంసు డాతని గనుగొని "నీవు విద్వాంసుడవైనను బాలకుడవు. మాతో వాదింప శక్తి నీకు లేదు. గావున నీకు దోచిన మూడు లౌకిక

వాక్యములు పలుకుము. ఖండింపబడును. లేదేని నేను పలికెదను నీవు ఖండింపు" మనెను. అందు లకు యామునుడు తానే

"నీ తల్లిగొడ్రాలు కాదు"
"ఈ రాజు సార్వభౌముడు"
"ఈ రాజమహిషి పతివ్రత" అనెను.

అందుల కా యాస్థాన విద్వాంసు లందఱు నిరుత్తరులైరి. ఇదియే మార్పు. ఇందులోకూడ రాజుకు కూరదెచ్చి యిచ్చుట తత్కారణమున నాతడు శ్రీరంగమున కరుగుట కలదు. కాని దీనిలో శ్రీరంగము కేగుఘట్టమున 84 పద్యములు గల రాజనీతి ఘట్టము జొప్పించి నొప్పులనుప్పుల మెప్పించె. ఈతడు ఈతడు వ్రాసిన గ్రంథములు 1. సిద్ధిత్రియము. 2. ఆగమప్రామాణ్యము. 3. పురుషనిర్ణయము. 4. చతుశ్లోకి. 5. గీతార్థసంగ్రహము. 6. స్తోత్రరత్నము. 7. మాయావాద ఖండన. ఆముక్తమాల్యదలో యామునాచార్య ఘట్టము. 250 పద్యములతో విరాజిల్లుచున్నది. ఇందులో రాజనీతియను 84 పద్యములు గలవు.

ఈ రాజనీతి రెండు మాటలలో జెప్పి ముగించిన బాగుండెడిది కాని యట్లుచేయక విపులీకరించుట యీ నాటి పరిస్థితులకు ప్రతిబింబమై యుండును. ఈ రాజనీతి కొంత సంక్షిప్తముగా యిచ్చట బొందు పరచుచున్నాను.

# 13

## రాజనీతి.

ఈ రాజనీతి ఘట్టము చాలా పెద్దది. 81 పద్యములు కలది. రాజనీతిని వర్ణించుట నీతడే ప్రథముడు కాడు. ఈ రాజనీతిని రుక్మాంగద చరిత్రలో, భారతము శాంతి పర్వములో, కళాపూర్ణోదయములో కాదంబరిలో పంచతంత్రములో, శకుంతలా పరిణయములో గల సద్గ్రంథములలో సభి వర్ణింపబడియె. కాని యింత వివరముగా గాదు. సూక్ష్మీకరించి వర్ణించిరి. ఇంత విరివిగా వర్ణించి రాజనీతిని వ్రాయుట కాంద్రభోజునకు హేతువులు

లేకపోలేదు. మొదటిదేమన యాతడు వర్ణనావైచిత్రియందు యపరబాణు డనిపించుకొన దలచినాడు. రెండవ హేతువేమనగా యీ రాజనీతి నాడు శ్రీరాయల ప్రభు డవలంబించి యీ సూత్రముల ప్రకారము రాజ్య మేకచ్ఛత్రాధిపత్యముగ నేలెనని నొక్కి వక్కాణించుటకే. నిజము పరికింప శ్రీరాయ లొక్కఁడే 'నావిష్ణుః పృథివీపతిః' యను నాభాషణమును సార్థకముచేయుచు రాజ్యమేలినది శ్రీరాయలుచెప్పిన రాజనీతి కొంత శుక్రనీతి సారములో, భారతములో, భాగవత యిత్యాదులలో కలదు. శ్రీరాయల రాజనీతి నిట సంక్షిప్తముగ బొందు పఱచుచున్నాను.

ఎట్టి కష్టములనుండి యేనియు విసుగొనక పాలింపుము. ప్రజాసంరక్షణమే రాజు భారము కావున ప్రజల కయ్యాలించి లాలించి పాలింపుము. రాజు ప్రజారంజకుడైన ప్రజలు రాజుమేలు కోరుదురు. అందువలన రాజున కేమి ప్రయోజన మన రాదు. అడవిగొల్లలు బోయలు లోనగు పాలెగాండ్రకు అడవిలో ఆజ్ఞ చెల్లును. ఎట్లనగా వారు ఎవనికైన అభయమిచ్చినచో వానిచేతికి యంపకట్టైను

గాని నూలిపోగునుగాని గుర్తుగానిత్తురు. దానింగని వారి పూజ్యులైన దొంగలు వానిని చెనకరు. అని ప్రసిద్ధి. అట్టివారికే యీ జ్ఞయావలె దుర్గములు నీ పృథ్వి బ్రాహ్మణోత్తములకీవలెను. వారిమీఁది కెట్టిశత్రువులు వచ్చినను నిర్భయులై తెగ టాడ్పుటకు నీయనర్గళాధ రాజ్యమువలన యీ దుర్గములందు వలసిన సేవలు సమృద్ధిగా నుంచవలెను. దుర్గాధిపతులు బ్రాహ్మణులుండుటే శ్రేయము. ఎంత గొప్పవాడైనను వానికి క్రమ క్రమముగా వారి సంగతి గుత్రైఱింగి వృద్ధికి తెమ్ము. రాజు రాజత్వము చక్కఁగానుండ కోరెనేని నీచకులజుని బోయలనడుమ జీవించువానిని, గురుశుశ్రూష చేయనివానిని, అసత్యవాదిని, అధర్మపరుని, పరదేశాగతుని తన దరి జేర్పరాదు. జాతిభ్రష్టుడైన బ్రాహ్మణుని దరిజేర్పరాదు. శుక్రనీతిసారము యిత్యాది రాజ్యాంగ గ్రంథములు చదివినవానిని మంత్రిగా ప్రతిభావంతుడగువాని నుంచుకోవలెను. అట్టి మంత్రి దొరకనియెడల రాజు తనంతకుతానే రాజనీతిప్రకారం బనుసరించి పనులు చేసుకోవలెను. ఒక దొర చేయవలసిన గొప్ప కార్యమును పలువురు దొరలను నియమించుట మంచిది. ఆ పలువురలో

వారి వారి యాస్తులు వుంచుదు గావున హరింతురు. తగ్గించినచో మఃఖింతురు. గొప్పపని యేదియేదియు వున్న యిది పలువురు గలిసినగాని పూర్తికాదు. కావున దొరలను వశీకరణము జేసుకొనుటకు హేరాళముగ ధనము నీయుడు. రాజు మంచి యమాత్యుల సంగ్రహించికోవలె. తగిన మంత్రి శుమలేసి రాజ్యంబు గాలిలోని దీపకళికవంటిది. రాజు బ్రాహ్మణుని గొప్ప యధికారమందు నియుమింపవలె. అట్లొనర్చుటచే మేలొందును. రాజున కార్జింపవలసిన యధికారము దేవాలయ ధనార్జనాధికార మొకనికే యీయకూడదు. ఇద్దరికి పై యధికారములు వేఱువేఱుగా యిమ్మా. రాజు దేశమును స్వాధీనముచేసుకొని పిదప యారాజ్యము కాపాడుకొని యచ్చటచ్చటి శత్రువుల నిరహ్కరింప వలెను. కొండెగాని, అప్రత్యవాదిని దరిజేర్పక జాగరూకుడవై మెలంగుము. చోరశేక్యముగాని సాంద్రారణ్యములందు నివసించుచు రాష్ట్రపీడ చేయు కిరాతకుల నివాసము తాత్కాలికముగా పరాయిశూరుల కొసగుము. వారిద్దఱు రొట్లు కీచులాడినను నీకు మంచిదే. బోయలకు చెంచులకు నడవి మనుష్యులకు స్వల్పములోనే స్నేహద్వేష

ములు కలుగును గావున జాగరూకుడవై వర్తింపవలెను. ఉత్తమాశ్వమును, ఉత్తమగజమును యాప్తయోధునకే నీయవలెను. అతడు నీ సేవకే వాటిని వినియోగించును. ఒక ద్రోహనిపనిని సరిగా కనిపెట్టి సభలో తెలుపగా వానిమీది ద్వేషముచే మఱియొకడు కాదనెనేని యా జాడను కనిపెట్టి యా యిరువురి పలుకుల నిషేధింపక సంభావించి పిమ్మట యా మొదటివాడు చెప్పినదే గ్రహించిన మేలగును. దుష్ట సచివులు సేయు దుండగముల కడు జాగరూకుడై జాడ మెలంగవలెను. రాజు యెప్పుడును సేనను తన చేతిలో నుంచుకొనవలెను. జీవన భంగము చేయక తా దధికారులతో చరింపవలె. రాజెప్పుడును బలముల తన చేతిలో నుంచుకొనుటే శ్రేయస్కరము. జీవనభంగము చేయక నీ కొలువు దొరలను కాపాడుము. ఇక్కట్టులో నెవడు చెరుపు సేయ ప్రయత్నించునో వానిని నీకు పిలక దొరిక తదుపరి శిక్షింపక వాని సిరిమాత్రము గైకొనిన కోఱలు పెఱికిన పాముపలె కీడుచేయక నుండును. దేశ మెంత విస్తీర్ణమైన నంత ఆదాయ మెక్కుడు. ఆ యాదాయమునకుగాను యెంతచిన్న భూభాగ మందైనను జలాధారముల నిర్మించి పంటకాల్వలు

త్రవ్వింపవలెను. పేదలకు పన్ను తగ్గింపవలెను. అట్లయిన నాదాయము బాగుగవచ్చును. నష్టపడి సేద్యములు చేయలేక వెడలిపోవువారల కుయ్యాలించి లాలించి పాలింపుము. వారికి తగు సాయమొనర్పుము. రాజు తన యాదాయము నాల్గుపాళ్లుగా జేసి యందు స్వానుభవమున కొకభాగమును, చతురంగబల రక్షణ శిక్షణార్థము రెండుపాళ్లు, భండారము నిండుట కొకపాలుగా ధనమంత వినియోగించవలెను. దొంగ దొరకినవెంటనే దండింపుము. శిక్షించుటలో నుపేక్షచేసిన రాజుకే మోసము వాటిల్లును. రాజెప్పుడు నీతిమార్గము వదలకూడదు. ఎఱుగ వలసిన విషయములన్ని ముప్పాతికవంతు తా నెఱుగవలెను. మిగిలిన నాల్గవ వంతు యాప్తమిత్ర బృందములవల్ల తెలుసుకోవలెను. తన మతమే జరుగవలెనని దురభిమానమొందక యాపదలందు పరాధీనుడు యాతడు చిరకాలము రాజ్యమేలును. రాజు కేవలము సుఖాస్వాదలోలుడు కాగూడదు. నొకవేళ నట్లయిన భూరుహాగ్రముమీద యచ్ఛభల్లంబు నిద్రించుగతి మెలంగవలె. జడదారులకు, సన్యాసుల గుణములకు మెచ్చి యగ్రహారములీకుము. ఇచ్చిన వారు బ్రహ్మ

చర్యావర్తము చక్కగా పాలింపక చెడిపోదురు. అప రాధులను మూడుమార్లు క్షమింపవలెను. అపా యము కల్గించెడు వధ్యుని తప్పక శిక్షింపుము. రాజు తన కొలువుకూటమందలి వీరులుపల్కు శూరాలాపములు వినవలె, వినినచో వారి కుత్సా హము గల్గును లేకున్న క్షీణించును. రాజు గుఱ్ఱ ముల, యేనుగుల, రత్న చందన మౌక్తికాదుల పెంచినటుల వర్తకమును పెంచి రేవులయందు దిగుమ తికి సౌకర్యములు కలిగింపవలెను. ఆగంతకులొ చ్చిన వారిని తగురీతి గౌరవింపవలెను. పరరాజు బలవంతుడాయెనా యాతని సత్కారముల స్వీక రింపవలె లేక అబలుడైన జయింపవలెను. రాజు పలువిధముల తన రాజ్యమందలి కంటకుల వెదకి నిర్మూలించి సుఖమున నుండగావలె. త్రివిధోత్పా దము లొదవిన తచ్ఛాంతికై రాజు బ్రాహ్మణులకు భోజనములు, దేవతలకు పూజలు, అగ్నికి హోమ ములు చేయుటకుగాను ద్రవ్యము వినియోగించవ లెను. రాజు తన గొప్ప యధికారులయందును, చోరులయందును నొకరిమీద నొకరికి పోటీలు పెట్టవలెను. దానివలన వానిగుట్టు వీడు వీనిగుట్టు వాడు బయలుపెట్టుచుందురు. దానివలన రాజ్యము

సుఖముగనుండును. ఎల్లయరులమీఁదికి రాజు తాను స్వయముగా పోఁగూడదు. అందువలన తనకు విశ్రాంతిగా తనకుమాఱుగా దండెత్తిపోవుటకొక దొర నేర్పరచుకోవలెను. ఆ దొర కొక దుర్గము భూమి నిమ్ము. అట్టి యధికారము బ్రాహ్మణునకే యీవలయును. నీ దేశపడవుల వృద్ధిచేయించుము. తత్కాంతారమధ్యంబుననుండు దొంగలను శిక్షింపుము. అడవిలో దుర్గమప్రదేశమందుండు మన్నెగాండ్రతో చెలిమి పాటించియుండుట మంచిది. వారు మన కవసరమగునప్పుడు సాయముకై వత్తురు. క్రొత్త యధికారికి మంత్రాలోచన యివ్వరాదు. మంత్రము బయలుచేసిన యెడ దోసమయు చెడును. రాజు తన మేలుకోరువారలకు, బ్రాహ్మణులకు, బాంధవులకు దుర్గములొసంగి వారి భోగమున కగునట్టి ధనము ధారాళముగ నివ్వవలెను. రాజు కాలానుసారముగ వైరిని గెల్వవలెను కాని ప్రతిజ్ఞ సేయరాదు. రాజు తన హితుఁడగు దొరసంగతి చారులవల్ల తెలిసికొనుచుండవలెను. స్వర్ణాది లోహముల గను లెక్కడనున్నవో తెలిసికొని వాటిని కాపాడవలె. రాజుల దినచర్య యిట్లుండవలెను. ప్రాతఃకాలమున కార్తాంతికుల

బ్రాహ్మణోత్తముల దర్శింపవలెం ఋూముప్రొద్దెక్కి నంత యార్థికపరిస్థితుల నెఱుంగవలెను. ఆదాయ వ్యయములగూర్చి మంత్రాలోచన చేయవలె. వ్యాయామము, మల్లువిద్య, వేటకాండ్ర క్రీడలు యిత్యాదు లొనంగుట. మధ్యాహ్నము దేవతా ర్చన సజ్జన సల్లాపము. భోజనానంతరము కవి విదూషకాలాపములు. నాలవజామున చారులకు దర్శనము. రాత్రి ప్రేయసితో సుఖించుట. వైద్యులు, కార్తాంతికులు, విద్వాంసులు, కవులు, పురోహితులు, రాజకు హితులు వారలు దుర్విధ ముల చరింపకుండ కాపాడవలెను. అనగా తనకు వ్యతిరేకము గాకుండ హవ్యములకన్న కవ్యములే సూక్ష్మధర్మము లగుటచే వేదాధ్యయన సదాచార చాంద్రాయణాది వ్రతములచే శాంతచిత్తులయిన వైష్ణవులకు శ్రాద్ధదేయములనిచ్చిన పితృదేవతలకు గతులు గల్పింపుము. రాజుచేయు షోడశమహా దానములు బ్రాహ్మణపోషణమునకు తనయొక్క పగతత్త్వజ్ఞానమున క్షేమమున కనుగుణముగా వర్తించుచు రాజు తన పాపముల మాయుటకై రాజ్యాంతమునగల్గు నరకమును తప్పించుటకై శ్రీమన్నారాయణుని ప్రార్థింపుము. రాజు పద్ర

సోష్ణేతమగు భోజనము గావింపవలె. ఆకలి లేనిది భుజింపకూడదు. అట్లయిన వాము వాటరు వాడు నవశ్యకత కల్గును. రాజుజ్జ్వలుడై యుండుటకు యొక మణిని ధరింపవలెను. రాజు సారవారము వేలు గై సేతచే వెలుగుచుండవలెను. వేయేల రాజు యన్న నావిష్ణుః పృథ్వీపతిః రాజ్యమేల చేయువలె పాపములేల సంపాదింపవలెనని వెనుదీయుక శక్తివంచనలేక రాజు పాపములుచేయకుండ రాజ్య మేలవలెను.

యామునాచార్య ఘట్టమంతయు రసవత్తరము, ప్రశంసనాతీతము.

అందు కుదాహరణములు:— పాండ్యరాజు రాణి యామునుని సభకురమ్మని చెప్పినందులకు యామెపడిన తత్తరపాటు నెట్లు వర్ణించెనో తిలకింపుము.

తే. గ్రీష్మసమయ నిరుత్సాహ కేకి రమణి
నవఘనధ్వని కలరుచందమున నలరి
యేకతపు నర్మగోష్ఠి ప్రాణేశుతోడ
నతని విధ మెఱిగింప నిట్టట్టువడుచు.

అదియునుగాక రాజు యామునునిగాంచి యడిగిన విధమును గనుడు.

గీ॥ సంగతియే మోయి యిసుమంత శింగరాద్రి
తత్త్వనిర్ణయ వాదంబు తరమె నీకు
నోడితేనియు బట్టి మేల్త్రో యనంగ
లింగమును గట్టుకుడుగ మెఱింగికొందువు.

అదియునుగాక రాజు పట్టమహిషితో చేసిన ప్రతిజ్ఞ యెంత రసవత్తరముగ గంభీరముగ వర్ణించెనో గనుడు.

క. అస్మన్మతస్థుడోడిన
భస్మము రుద్రాక్షములను బాసి యతనిచే
విస్మయముగ దప్తముర
ఘస్మర చక్రాంకితుండగా గలవాడ౯.

తే. ఉవిద యీ నీమ విద్వాంసుడోడెనేని
నీకు నతనికి నన్న పూనిక యెయున్న
నొప్పితిమి దేవబ్రాసతి దప్పకున్న
జాలుమఱి పంచభూతముల్ సాక్షిగాగ.

# ఆముక్తమాల్యదా చరిత్రము.

ఇదియే గ్రంథములోని కెల్లను శృంగార రస ప్రధాన ఘట్టము. కాని ఈ శృంగార మనురాగ పూరితమైన భక్తి ఇదియే పరమ పవిత్రము. శ్రీ రాయలుకూడ శ్రీనాథునివలెనే యామె సౌంద ర్యమును కెరి పద్యములలో వర్ణించినాడు. ఆనాడు రుక్మిణీదేవి విరహవేదన బడలేదా! ఎప్పుడు చెలు లకు మీా పాడిన హరిచందములే పాడి గదలప వచ్చునని యడుగుచుండున. ఈమె విరహవేదనను ప్రబంధ నాయికలవలె యెంత మనోహరముగ వర్ణిం చెనో గ్రంధపఠనమువల్ల గనుడు. నైషధకారుడు నలుని విరహము వర్ణించుచు వ్రాసిన సీసపద్యము వలెనే శ్రీ రా య లు కూ డ నొక సీసపద్యమే వ్రాసినాడు.

శ్రీ రా య లు :—

**సీ.** నఖముఖోల్లిఖిత పరాఙ్ముఖముక్త బాష్పాంబు
పటిమ దీపపు చిటపటలు దెలుప

బోరనుపాంశూత్సృష్ట పూతకృతు లక్ష్మికుక్షి
పార్శ్వ ముహుఃప్రకంపనులు దెలుప
నోదవెడు గాద్గద్య మదరుపాటున బల్క
రింప బుట్టెడు కేకరింత దెలుప
వలవంత నిసువుకాంతల పుట్టు దూపించు
కారణంబులు తోంటి కథలు దెలుప

గీ. నలత బానుపుపై బొరలాట తెలుప
దెగువ లోలోననే నవ్వు నగవు దెలుప
గలక మామిడి పనిలేని కసరు దెలుప
బోలతి దేలు నీయున్కియే పులుగు కాదె.

శ్రీనాథుడిది పద్యము—"జాగరోద్భూత." శృం—నై. ౧—౮౬. అదియునుగాక యింకొక పద్యము గనుడు. ఇది శ్రీరాయల యప్రతిమాన భావనాపటిమను వ్యక్తము చేయగలదు.

మ. తలిరుంగైదువు జోదునాసతి వ
ధూ ధైర్యంపు బెన్కోటగం
దళితా హార్మ్మఖియంత్రకారు డలు
కన్యానాటికిం ద్రెళ్ల గో

మల మార్తాండ మరీచి దీపకళి
కోపమ్మంజూపియే యుందళ
ద్దళ పాథోరుహ లోహనాళ కుహ
రోద్యచ్చంచరీకాస్త్రముల్.

దీని భావము:—

ఆమెకు సూర్యోదయమునందు దమ్మికోలంకలోని సూర్యకిరణములు నిగుడుటయు, ఆ తమ్ములు వికసించుటయు, వానినుండి మత్తభృంగములు బయలువెడలుటయు జూడగా వలరాజు నాశించే లేకుండయును ఫిరంగివాడు ఆమె ధైర్యమనెడి షెన్నో టనగూల్చ ప్రతిదినమును కోపముతో సూర్యుని కిరణమను సన్నని దివ్వె మొగ్గను తన చేతిలో ఆ తామరలనెడి ఫిరంగుల చెవులకంటించి అందుండి ఆ తుమ్మెదలనెడి యినుపగుండులను ప్రయోగించుచుండెనా యనునట్లుండెను. చూచితిరా భావమెంత లలితముగా గాంభీర్యముగా నిమిడియున్నదో. పిట్ట కొంచము కూత ఘనమనునట్లు పద్యము 80 అక్షరములైనను యెంత భావ మిమిడియున్నదో, ఈ ఘట్టమునకూడ 160 పద్యములు గలవు కాని

ఆముక్తమాల్యద జననము, విరహావస్థ ౨౬ పద్యములే. మజిల వసంతఋతువు ఆముక్తమాల్యదను వేపుకు తినుటకు బయలుదేరింది. ఇందు వసంతకాలమును వర్ణించుచు నొక మహాద్భుత పద్యమొక్కటి రచించినాడు. దాని భావ మెంత గాంభీర్యముగ నున్నదో నొక్కసారి తిలకింపుడు.

మ. మదనస్యందనతాస్వనస్మృతి దెలి
పెం బాండీరభూభృద్వల
న్మృదువాతం బలి పక్వపాదపల
తా వృంతావళీ మూలరం
ధ్రదళత్పంకజ కర్ణికాంగణ హ
రిద్రాళిభంగ భాభాసుర
చ్ఛదనచ్ఛద్మ నివర్తి కాంచనక
నచ్ఛత్రచ్ఛటాచీత్కృతిన్.

ఇట్లు కృష్ణరాయల వర్ణనా చాతుర్యమును పాఠకులు గమనింతురుగాక. శ్రీమన్నారాయణుడే యాముక్తమాల్యద వయోరూపలావణ్యాదులజూడ యాతని మనోప్రవృత్తి యెట్లున్నదో కవి యెట్లువర్ణించెనో గనుడు.

సీ. దీని చూపుల పెక్కు గానెకా సిరిపట్టి
కిని బోరబిరుదు డెక్కెంబుగలిగె
దీని కానల్లాడగానెకా గర్వించి
యుర్విజైత్రునకు గాలూదగలిగె
దీని పాలిండ్లుబ్బగానెకా రతిచేతి
కిన్నెరగ్రమోతకు వన్నెగలిగె
దీని మోమొప్పారగానెకా వాణి రా
యంచ లేమకు గులాయంబుగలిగె

దీని పెన్నెఱులేపారగానెకా ప్ర
పోషితమయూరికి విరాలిపొందుగలిగె
దీని యడుగులు రంజిల్లగానెకా పి
పాసబడు తేటులకు మెట్టపంటకలిగె.

ఈమెను గాంచి కాముకుడివలె మోహించి కామించి ప్రేమించి పెండ్లి కాకమునుపే ఐక్యము గావించుకొన్నాడు. ఎంత అన్యాయము, అయినను పరమేశ్వరున కేమితప్పు. ఆమె యాతనికి పూర్వ జన్మమందు భార్యయేకదా! అది యును గాక వివాహము కాకమునుపే వలచి వివాహమాడి నాడు. నేటివలె కొన్నిరోజులు కాపురము చేసిన

తర్వాత దాసి జీవితము పాడుచేయుట. ఈ పని చేసినందుకు విష్ణుచిత్తునికి చీవాట్లకు పాలయినాడు భగవంతుడు. మామ లీనాటించలేనే అల్లుణ్ణి తిట్టుట నాఁటినుండియే యున్నట్లు గన్పట్టెడిని మా మామవలె.

# 15

# చండాల బ్రహ్మరాక్షస సంవాదము

మూలము—వరాహపురాణము.

ఈ చండాల బ్రహ్మరాక్షస సంవాదము బ్రహ్మరాక్షసుని మూఢభక్తి తెలుపుటకే వ్రాయబడినది. దీనికి మూలము వరాహపురాణమునుండి గ్రహింపబడినది. అందు నలుబదినాల్గవ సర్గలో కలదు. వరాహపురాణాంతర్గతమగు బ్రహ్మరాక్షస సంవాద మెక్కడ; విష్ణుభక్తి ప్రాముఖ్యమయిన గ్రంథరాజ మెక్కడ. అనగా పెక్కుచిక్కులు

యుక్కిరిబిక్కిరి చేయుచున్నవి. ఈ ఘట్టమును యుత్త్యాత్తమ యపరితిమాన కవితాప్రతిమ గనబ రచివాడు. మాలదాసరి బ్రహ్మరాక్షసుని రాక్షసులు అమరులౌదురని చెప్పెను. అంత నా బ్రహ్మరాక్షసుం డోయీ మాతంగీ మేము మాంసభక్షకులైన తప్పేమియు లేదు. వారును అగ్ని భక్షింతురు గాదా! అగ్ని సర్వభక్షకుడుగదా! కావున మేము చేయునదేమి తప్పుగాదని బలుకు టెంత గమ్యముగానున్నదో పరికింపుము.

మ. విటు మోహాహో మము వారిభ్రాంతులను
చుక్ నీవంటివార ల్పుదా
శులపూతాశులు గారటంటి ప్రతి
పత్తోస్సమాంశముల్ గ్రోలు చుక్
జ్వలనుండంటికనొండు నిన్నడిగె
దక్ సర్వాశిగాడా యుతం
డిలదన్నా త్రయమ చాలు మాకు నఘ
మే వృద్ధానుచారంబికక్.

దీనిని విని మాలదాసరి మాతంగినిచూచి నేను ప్రతిదినము "సఖ్యంసాప్తపదీన మన్మనమిథ

స్వాజ్ఞస్య" యను వ్రత మాచరించుచున్నాను. అందుల కనుజ్ఞయిమ్ము. తరువాత నీ కాహార మైదనని చెప్పి నతిర్వాత యాతడందుల కియ్యకొనిన తర్వాత యాతడునుపోయి తన కార్యమును నిర్వర్తించి యాతనితో నిట్లనెను. బ్రహ్మరాక్షసుడు మాలదాసరితో చెప్పినదానిని గనుడు.

శా. ఈ సర్వం సహ దేవ దానవమహీ
భృన్నామ్ని వాచాతప
శ్శ్రీ సర్వస్వము నేతదస్యాః కృతులం
జెప్పంబడు న్ఘోరమౌ
నీ సత్యంబురరీకృతాంతిమిల నెం
తే వృద్ధనై మంటినే
నాసత్యంబిక నిన్నుబోలె గృతసం
ధాధూర్వహుల్లేమికిన్.

ఈతని వర్ణనలుగూర్చి యొక్క మాట ఈతడు వర్ణనలందు బాణుని కేమియు తీసిపోడు. "కాంచన్నైర్ణవ" ఇత్యాదు లుదాహృతములే కాన దాన యాతని వర్ణనాచతురి వ్యక్తమగును. అయినను యింకొక పద్య ముదహరించి పూర్తి చేతును. సోమశర్మ యైనవిధము,

సీ. స్నిగ్ధత్రిభాగముండిన శిరశ్శిఖతోడ
హిమ ధవళోపవీతముల తోడ
బుణ్యాషడ్ద్వాత యోర్ధ్వ పుండ్రవల్లులతోడ
తులసికాబ్జసగావళులతోడ
గాపీన కటిసూత్ర కాషాయయుగితోడ
జలపూర్ణ శుభ కమండలువుతోడ
బాణిస్థ దివ్యప్రబంధ సంపుటితోడ
సత్తర వాక్పూర్వకోక్తితోడ

బసిడి జిగితోడ బ్రహ్మవర్చసము పొల్చు
భాగవత లక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె సమ్మ్రను వెడలి చూడ
చూడ వైష్ణవుడై సిల్చె సోమశర్మ.

ఇమ్మహా కవికంఠీరవము వర్ణనా బాహుళ్యమం దసమానుడని చెప్పియుంటినిగదా, ఇతడు నాడు భోజనాదుల నుపయోగించుకొనెడి కూరలను, ఫలహారములను, బ్రాహ్మణులు అన్యాయముగ డబ్బు నెట్లుగడించిరో యెంత మనోహరముగ వర్ణించెనో యీ క్రింది పద్యము వ్యక్తపరచును. ఈ క్రిందిపద్యమానాటి భోజనమందలి కూరగాయలనుకూడ యెట్లు వదలక వర్ణించినాడో గనుడు.

మ. గురుగుం జెంచలి దుమ్మి తేదగిరి
పాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడ బొరంటిసూనియల
తో గట్టావి కుట్టారి కో
గిరముల్ మెక్కి తమింగ్రామాల్పాలము
లో గ్రేప్సుల్ మెయు ల్మాకమే
కెరవుం గుంపటి మంచమెక్కిరి ప్ర
భుత్త్వైకాప్తి రెడ్డజ్జడిన్.

ఇట్లింకేని ఇమ్మహాకవి వర్ణనా బాహుళ్యమును వర్ణింపవచ్చునుగాని గ్రంథవిస్తరభీతిచే కాకతాళీన్యాయముగా జెప్పి పాఠకులను మన్నలను గోరుచున్నాను.

# 16

## ఆముక్తమాల్యద-వర్ణనలు.

వర్ణనా వైచిత్రిలో శ్రీరాయలు గీర్వాణ కాదంబరి కర్తయగు భట్టబాణుని కేమియు తీసి

పోడని వచించియుంటిని. అతడే వర్ణనచేసినను యెక్కువగా జేసెను. అది తన పాండిత్యప్రజ్ఞల ప్రాజ్ఞులకు తెల్పుటకే. ఇందలి మధురాపురవర్ణన, విలిబుత్తూరు వర్ణన, పుష్పలాటిక వర్ణన, ఋతు వర్ణన, రాజనీతి వర్ణన యే గ్రంధముయొక్క యెక్కువభాగము కాచేసినవి. గ్రంధము మొత్త ముపైన 870 పద్యములున్న 450 పైన వర్ణనలే కలవు. బాణుని కాదంబరి కథ రెండుమూడు దీర్ఘవాక్యములలో చెప్పవచ్చును కాని యాతని గ్రంథమం దంతేయు వర్ణనలతో పాండిత్య ప్రక ర్షతో నిండివున్నది. ఆముక్తమందు శ్రీరాయలు దేవాలయమును, వైష్ణవులను, అతిథిసత్కార పూజావిధానమును, ద్రావిడాంగనల చతుర పరిహాస విలాసోక్తుల, భాగవతోత్తముల దినచర్యలు, రాణి వాసపు కాంతల కార్యములు, వసంతఋతువున తుమ్మెదలుచేయు ధ్వనిని, చిగురించు పల్లవముల సౌకుమారత, రాజుల చర్యలు, రాజనీతి ప్రకా రము, యుద్ధమునందు భక్షించెడి భక్ష్యభోజ్య చోష్య లేహ్యాదులను, యాస్థానములందు నిరంత రము జరిగెడు వాగ్వాద గరిమలను, భగవత్ సాక్షాత్కారమును, విష్ణుచిత్తుని భక్తిపారవశ్య

ప్రాధాన్యము, శైవమత నిరసనప్రకారమును, బ్రహ్మ రాక్షసులపై నుండెడి నాటి గట్టి నమ్మకములను, కాంతలు కాంతులకై నొందెడి విరహవేదనలు, లక్ష్మీ కల్యాణములు, దుర్వ్యసనులైన బ్రాహ్మణులు చేయు ఘోరకార్యములను, సర్వ దుర్విధముల గర్వాంధత్వమున వారు గడించునట్టి ధనము తెలుంగు, వడ్డీలకిచ్చి ధనమార్జించుట, శూద్రులు ఎక్కువ మక్కువతో మత్స్యాది జలచరముల భక్షించుట, మార్గమధ్యమున నెదురైన చోరు లాభరణములు హరింప నుద్యుక్తులైన యవసరమున వారు పన్ను పన్నాగములు, మాతంగులుకూడ శ్రీహరి కృపాకటాక్షవీక్షణకు పాత్రమగు విధమును, రాజుల గర్వాంధత, నాడు జరుగు ఘోరరణముల సంగతి, నొకని మేలుచూచి యింకొకడోర్వకుండి యీర్ష్యాభావ సందష్టులగుట, తమ్ముని రాజ్యము కూడ తన రాజ్యము చాలక హరించుట మరల యాతనివద్దకే కార్యార్థియై వెళ్లుట, విశిష్టాద్వైత మత సిద్ధాంతమును, వైష్ణవమత ప్రాబల్యత, బ్రాహ్మణులకున్న గౌరవము, యీస్థానములందు వారికున్న స్థానము, విషయసుఖాస్వాదలోలుపత్వ మున తమ్ము తమ నిర్వర్తించుకొను కార్యముల

మఱచి యుక్తాయుక్త వివేక విచక్షణాలేక సంతతము కాంతాజన సమాలింగిత సౌఖ్యావహులైన ప్రభువుల సంగతి, రాజులు "రాజానాం బహువల్లభాః" యను నాభాషణము సార్థకంబుచేయుట యిత్యాదు లాముక్తమాల్యదలో అచ్చుగ్రుద్దినట్లు వర్ణింపబడినవి. ఉదాహరణములిచ్చిన గ్రంథము విస్తరమగును. అయినను కొన్నియిచ్చి వానిలోని విశేషాంశముల చర్చింపబోవుచున్నాను.

మ. అలపర్జన్యుడు కేకి పాత్రముల గుం
పాడించుచో మేఘమం
డలపుఁ మద్దెళ గ్రుంగ లేవగ మఱి
న్నార్ద్రాంగికుం డర్థి నా
త్తలరిఁ నేలకు వ్రాలుచు న్నగయుచుఁ
డారాడు నత్తెల్లజ
ల్లుల గెంగుచ్చులు పర్యా ధారలును ద
ల్లోలేంద్ర గోపంబులన్.

ఇది వర్షాకాలమునుగూర్చి వ్రాయబడిన పద్యము. దేవేంద్రుడు నెమళ్లనెడు పాత్రములను గుంపుగా నాట్యమాడించునప్పుడు మద్దెళగాడు మేఘమండలమనెడి మద్దెళను నటనానుసారముగా

క్రిందికిని మీదికిని దించుచు నెత్తుచును నుండెగా ఆ మేఘమండలముతోఁగూడ క్రిందికి వచ్చినప్పుడు భూమికిఁ జేరువుననుండి అతి పైకిఁ బోయినప్పుడు భూమికి దవ్వుననుండియు మేఘమండలమునుండియే వ్రాలుచుండు వర్షధారలను వాసి దుదియంతదూరమైడి యారుద్రఘురుగులును మృదంగము క్రిందికి వచ్చినను పైకిఁబోయినను మృదంగమునుండియే వ్రేలుచుండు తెల్ల జాలరులును వ్యాసతునినుండెడి యజ్ఞసూత్రని కుచ్చులుగా నొప్పుచుండినవి. చూచితిరా యెంత భావగంభీరమో? ఇట్లింకెన్ని యోగల్లవు. ఈ రెండు పద్యములు వసంతకాలమందలి భృంగముల విలాసమును చిగురాకు వర్ణనను తెల్పును.

"మునునల్లమిఁబట్టి ముంగాళ్ల ముకుళజో
డనల బీలిచి పసరొల్కినిన విడచి"

"మరుదూఢ ఘలయూహి గరధూమ్యలను గళ
న్మవసి జరథష్టద్రాంజన కళికలు"

యను రెండు పద్యము లుదాహృతములు.

చిగురాకు వర్ణన.

సీ. ఘన్మవశారక్త్రాంకవమరగాన్యనీమ
ఘనాది తారుణిమవల్ల్యురగుపని

కోద్గతి, తరుగరుత్మద్గరుద్గణము క్రీ
డాహార్యజీమూత రోహితంబు
నవమిళింద ప్రాహుదాళని మంత్రణశోభ
నాక్షతపత్రతతి వాయసనవిభక్త
పరభృతౌఘప్రాప్తపత్త్రిక మాలతీ
త్రాసామయావహార్ద్రక్షతజము

ప్రమద వనవనదేవతా సముదయాంగ
రాగ మిగజహారిజ్జగప్రాణశాణ
కషణ దళితదళ్ఘుత సక్రాంతకాంతి
ఘనమణిశిలాక చిగురాకు గలయ మొలచె.

ఇట్లీ గ్రంథమంతయు వర్ణనాప్రకీర్ణములతో నలరారుచున్నది. పురవర్ణన బాగుగ గావించినాడు. అందు కుదాహరణము "లలితోద్యాన పరంపర" యను పద్యమే, పటక్ష్మాజ వర్ణన చేసినాడు. ఆ పద్య మిదివఱకే నుదహరించియున్నవాడను. విష్ణుచిత్తుడు వాదము గెల్చినతర్వాత నభోమండలమున యక్షగంధర్వాదులు చూపు సంతస మభివర్ణించిన పద్యరాజమగు "అగ్ధావాగ్వైబుధం" యిదివఱకే యుదాహృతము. గ్రీష్మఋతువును వర్ణించిన పద్యము "తరణిల్" అను పద్యముకూడ నుదహ

ర్ణించినాను; యెక్కువగా వర్ణించినచో గాని దేశక్కైనను వైశిష్ట్యమురాదని తలంచి సంస్కృతాంధ్ర పదభూయిష్ఠమగు దీర్ఘ సమాసాలతో నింపి తనకు గల ప్రకృతిశాస్త్రగరిమ పాండితీ ప్రకర్ష యిత్యాదుల పండితప్రకాండులకును సాహిత్యాభిమానుల కెల్లరకును తెల్లముచేసినాడు. ఈ గ్రంధమందలి వర్ణనలన్నింటి సారస్యమును తెల్పగోరిన గ్రంధపఠనమే యుత్తమమని తోచెడిని.

ఆముక్తమాల్యదా విగ్రహము, ఆమె హావభావ లీలావిలాసాదులగాంచి సంతసమొందుట యిత్యాదులు బాగుగ వర్ణించినాడు. వివాహ సమయమున ప్రతి యంగ యంగమున శృంగారింపగపెట్టు శృంగారాభరణముల క్రమమునుగూడ తెలిపినాడు. భగవంతుడును, శ్రీమన్నారాయణుడునునగు శ్రీ రంగేశ్వరుడుకూడ ఆముక్తమాల్యదా రూపసౌందర్య విలాస విభ్రమాదులగని మనంబు కలంగ పంచేషు విలుకలుంతితే చిత్తుడగుచు లోపల నైక్యముగావించుకొని విష్ణుచిత్తుని యొక మాయా నాటకమాడించి తుదకు నా చేడియను పెండ్లాడినాడు. ఈ విషయమును శ్రీ రాయ లెంతో అన

పద్యహృద్యగరిమతో సహృదయ హృదయంగమం బుగా వర్ణించినాడు.

శృంగార రసవర్ణన యితఁడు మానుకోలేదు. కొంత చేసినాడు. కాని యసభ్యశృంగారము చేయ లేదు. భక్తిభావమునుమాత్రము అపర పోతనామాత్యునివలెనే నెలకొల్పి యచ్చటచ్చట జిలిబిలి పలుకులతోను, యచ్చటచ్చట అచ్చతెనుఁగు పదములతోను, అచ్చటచ్చట గీర్వాణాంధ్ర వాగ్గుంభనా గుంభోపేతములతోను నింపి విద్యచ్చక్రవర్తి యని యనిపించుకొన్నాడు. విద్వత్కవి శ్రేష్ఠు డెప్పటికిని విద్వత్కవిరాజకంఠీరవుడే! వర్ణనా వైశద్యమునందున యీతనిని బాణుఁడనిన తప్పేమి యులేదు. బాణుని అచ్ఛోదసరోవరవర్ణన శ్రీ రాయల పటత్సామ్రాజ్యవర్ణన రెండును స్ఫూర్తిగ సమానముగు కవితాప్రతిభతో రచియింపబడినవి.

రాజుల నిత్యవృత్తికి.

"సౌఖశీయనిక భిషక్పూర్వకము కాల్య
వేళ గార్తాంతిక ద్విజులగోష్ఠి"

యను పద్య ముదాహృతము.

దొంగలతో పరిభాషలాడు సంగతికి.

"పసలేదు నిలరోయి పాతకులారని
దేవాయుధంబును అభావు వాఉు."

యను పద్య ముదాహృతము.

## 17

# కృష్ణరాయల ప్రతిభా విజ్ఞానములు

కృష్ణరాయలు బహు భాషా పండితుడు. దానివలన క్రొత్త క్రొత్త మాటలు గ్రంథములోన నిమిడ్చినాడు. ఈతేడువాడిన పదజాలము (శ్రీనాథుడు, రామకృష్ణుడు తప్ప) యింకెవ్వారును వాడలేదు. అరవజాతీయము, కన్నడపదములు యిత్యాదులు చాలా యీతని గ్రంథమునందు జీర్ణమై పోయినవి. కొన్నిటి యర్థము విచిత్రము గ నున్నవి. మనమింతవఱు కెన్నడును వినని పదజాల మాతని కవనమందు పొదుగబడి వున్నది. కొన్ని

పదము లీతని సర్వంకషాపాండిత్య యశోఫలకము అవి యే పద్యమునం దిమిడ్చబడి వుండునుగాన యవి చాలా తుక్కుముక్కల హక్కుచిక్కు కల్గించును. ఈ గ్రంథమందలి గరుడస్తుతిలోనిదొక పద్యమగు "ఖన ఏత్పయోబ్ధి వీక్ష్య రసాతలాన్వ్యక్ష్య" యను దానిలో కొన్నిపదములు గలవు. పిండీకృకములు ఝుంపాత, ఇరమ్మదగు లిత్యాదులు. ఇంకను కొన్ని పదములు కలవు వాటి యర్థస్థాపనకై నేటి పండితప్రకాండులు వాదవివాదాలకు తర్జన భర్జనలకు పాలగుచున్నారు. ఇటీవల పాడబ శబ్దార్థనిర్ణయమునకై నలుగురు పండితసశ్రేణ్యులు వరుసగా నొకరొకరివి ఖండించుచు భారతిలో వ్యాసముల ప్రకటించిరి. ఇందులో యేది నిజమో తెలియరాకుండ వున్నది. దీనిలో లింగడంబైన యను పద్యమందు కప్పురపునాభి యని వాడినాడు. నాభియనగా యిచ్చట నాభి బిలము గాదు. మొగముపై పెట్టుకొను కస్తురిచుక్క యనియే మనము తెలిసికొనవలెను. సంగతియెమోయి యిసుమంత ఠింగణావు అని యింకొకచో ప్రయోగించినాడు. అది కర్ణాటపదము. కాని దాని యర్థ మిదమిత్థమని చెప్పుట యసంబద్ధ వాదనయగు

చున్నయది. ఇందులో యింకొక శబ్దము శీత్కార
యని కలదు. ఈ శీత్కార శబ్దార్థమునొక వస్తువ
విఱిగినప్పుడు కలిగిన ధ్వనియని తెల్పవలసి వచ్చు
చున్నది. ఇంకను కొన్ని మాటలు ప్రబంధయుగా
న్యల నురకములి కనుపట్టుచున్నవి. దీనిలోనున్నంత
జటిలపదభాగ మెక్కువ యెక్కడను లేదు. కృష్ణ
రాయల సర్వంకషా పాండిత్యస్ఫోరకములని అరా
లని వేదమువా రుదాహరించి యున్నారు.

ఇందులో దివాణము, తెండి, తృణాతా
యిత్యాదులు నాకు క్రొత్తగా యెన్నడువినవట్టివిగా
గన్పట్టెడిని.

"సాయంకాలములన్ దదీశమురజిత్పద్మస్వ
నద్దుందుభీ" యను పద్య మెంత క్లిష్టముగనున్నదో
గనుడు. దానికన్నను మెక్కువ పాండిత్యస్ఫోరక
భరితముగ నున్నదని "స్యందనస్థిత" యను పద్యము
దక్క వేఱొక్కటుండునని వేఱనొక్కవక్కాణించ
వలెనా ! ఇది వుచ్చారణకుకూడ నసాధ్యమై నల
రారెడిని. ఇట్లు ప్రతిభావిజ్ఞాన ధురంధతతో వ్రాసిన
శ్రీ రా య ల ప్రతిభ తెలియుగ నెవరితరము.

అందులో నాఁబోటి జ్ఞానలవదుర్విదగ్ధుల కేమియర్థ మగును. విద్వద్వరేణ్యులకే యర్థముకాక విసివి వేసారి యీ గ్రంథమును చూడకుండఁ యుండినప్పుడు అందుకే కాఁబోలు ఆంధ్ర ధ్వన్యాలోక గ్రంథకారగు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారు వేదము వారికి దక్క దక్కొరులకు యర్థముకాదనియు తత్కావ్య రసామృతాస్వాదన మన కశక్యమని విచారపూర్వకముగ బల్కిరి.

# 18

## కావ్య ప్రాశస్త్యము.

కావ్య ప్రాశస్త్యమనగానే దానియొక్క భాషాకాఠిన్యమని యను ప్రశ్న కల్గుచున్నది. ఈ గ్రంథము నిస్సంశయము నిస్సందేహముగ అసమాన వాగ్గుంభనలతో నలరారుచున్నది. కాని యిట్లు వ్రాయుటకు కారణమేమని యడిగిన యది యానాటి యాచారమై యుండెను. పూర్వ ప్రబంధ

సమాన వాగ్గుంభనా గర్భితముగ లేదా !!! కాశీఖం
డము సమాస జటిలముగ లేదా !!!! ఇట్లుదాహరణ
ములు. కాని పై వానియందు కొంత శైలి మృదు
మధురముగ నున్నది. ఇది శ్రవణానందముగ లేదు.
అన్ని శ్రవణానందముగవున్న కటువుగ నేవియును
నుండవలదా ! ఈ గ్రంథము కృష్ణరాయల యప్రతి
మాన ప్రతిభావిజ్ఞానముల వ్యక్తపఱచుచున్నది.
సామాన్యముగ నిది ప్రాజ్ఞులు, రసజ్ఞులు పఠింపదగిన
గ్రంథము. కాని కొందఱికి నచ్చదు. దీని కర్తృత్వ
విషయము చర్చించుటే చాలవఱకు సరిపోయెను.
ఇంక దీనిని సావధానముగ చదువువారెందరు. ఈ
గ్రంథము ప్రౌఢప్రబంధములలో నొకటిగా వ
చ్చును. ప్రౌఢప్రబంధము లెవ్వియో ముందు
సందేహంబు డిందుపడ తెల్పియున్నాను. ప్రౌఢ
మనగా శైలియందా, పాకమందా, కవిత్వమందా,
వాగ్గుంభనలయందా, భావమందా యనిన యన్ని
టియందని చెప్పవలసివున్నది. కొందఱి కొందఱి
కవుల కొక్కొక్క దానిలో ప్రౌఢతనుజేర్చి కావ్య
ముల్లుశక్తి గల్గియుండెనని కృష్ణరాయలుకూతురు
తెల్పియుండలేదా ! ఈ కావ్యము సర్వవిధముల
పండితజనాదరణీయమై యలరారుచున్నది. వేయేల

యీ ప్రబంధము ప్రౌఢమగు నొక యుద్గ్రంథము. దానిని యీరోజు యెక్కువగా చదువకపోవుటచే దానికి ప్రాశస్త్యము పోవునా? 500 యేండ్లనుండి యిప్పటివరకు నిల్చియున్నదనిన యదియే హేతదు గ్రంథరాజ ప్రాశస్త్యమును వేనోళ్ల జాటుచున్నది. దీనిలోకూడ చక్కని లోకోక్తులు గలవు. ఉదా.

1. కుంపట్లో తామరలంబోలె
2. పుట్టు మతి నూతులు ద్రవ్వ బేతాళముల్
3. పిసాళ్ళింగిన శుక్రవారిధికిం గొరతయే
4. పుణ్యమునకు కప్పురము పెట్టి పుచ్చుకొనుట.

పైన వక్కాణించినవిధమున నిక్కముగ నిక్కావ్యరాజమునకుగల ప్రాధాన్య మపరిమాణము గావున దీనిని యెల్లరును చదువుటొప్పు.

ఈ గ్రంథము ముఖ్యముగా భక్తిప్రబోధకై వ్రాయబడినది. అతిథి సత్కారమును పరిచారము సేయుటకు, జాతిభ్రష్టులగు బ్రాహ్మణులకన్న జాతి చండాలుడేయని చెప్పుటకు అపరిమత్తులై స్వచ్ఛందముగ కాంతావిరహార్తులగుంది విషయసుఖాస్వాదలోలురగు ప్రభువులకు బుద్ధిసెప్పుటకు, వేదాంతమే ప్రశంసనీయము. నారాయణుని సాక్షాత్కారములేనిజన్మ వృథాయని తెల్పుటకు. అవివాహిత కాంతలను బలవంతమ్ము జేయరాదు. పరదారల నంటరాదను నీతిని బోధించుటకై, రాక్షసులు నిశ్చలభక్తియొక్కటీపున్న వారేమిచేయజాలరని తెలుపుటకు, దేవతలను మెప్పించుటకై యజ్ఞయాగాదులు చేయవలెనని. భక్తియే ముక్తి, భక్తియే శక్తి తదితరయుక్తులన్నియు వ్యర్థములని సెప్పుటకు, వ్యావహారికము వ్యావహారికమను వాదములాడువారి బుఱ్ఱ బగులగొట్టుటక. ఉద్గ్రంథములు లేనికాలమున పరీక్షలకు పఠనీయగ్రంథముగానుండి చదువురాని బాలురకు భాషాజ్ఞానము కల్గించుటకు. పాండిత్యపరికర్ష సాహితీపటిమ యొక్క కావ్యములో తప్ప యింకొకదానిలో చూపుట సాహసికృమని తెల్పుటకు. తగురీతి

యుద్ధము చేయుమని నేడు పౌరాణుజాతులకు బోధించుటకై, రాజులకు రాజనీతి తెలిసియుండుట యవశ్యకము. రాజకీయ వ్యవహారాదుల చక్కబెట్టుక యేకచ్ఛత్రాధిపత్యముగ తగు యమాత్యాచార్యుల సహాయముచేత సామ్రాజ్యము వైరి రాజోరగ వైనతేనయుడై పండితజన కమలాకర కమలాకరుడై యేలుమని, ఆంధ్ర భాషాభివృద్ధికి పాటుబడమని, ఆంధ్ర సరస్వతిని మణుల నొకసాటి యలంకరించి శృంగారమైన కదంబమును గుచ్చి యామె కంఠములో చంద్రహారములో వేయుమని ఆముక్తమాల్యద నీతిని యుద్ఘోషించి యుద్ఘాటించుచున్నది. ఆనాటినుండి యీనాటివఱకు గౌరవముతో యింత అభిమానముచే విద్వాంసులచేత చదువబడుతున్నదని దానిలోని నీతి వేఱే నక్కాఱశింపవలెనా! రాజులు కూడ కవులే. వారు బండాయూంబ్రూహీంగా నుండరనుటకు అనురాగ పూరితమైన భక్తి, మూఢభక్తి, జ్ఞానపూరితమగు భక్తి యను త్రివిధమగు భక్తిలో యేదేని యొక్కటుండిన జాలని తెల్పుటకు, వివాహాదులు సక్రమ పద్ధతిలో విప్రోత్తములచే వైదికరీతిలో జరిపింపమని కామాతురులకు లజ్జాభయము లుండవని స్త్రీబుద్ధి

ప్రళయాంతకమని, యెంత గొప్ప దేవుడైన శ్రీ యపాంగవీక్షణమునకు గురియేయని, ప్రకృతియే ప్రియయని, ప్రేమశృంగారము లేనియెడల మాన వుని జీవితము మనోరంజకముగ నుండదని గృహ స్థాశ్రమమే యాశ్రమము లన్నింటిలోకల్ల ప్రశంస నీయమని, వేదాంత జ్ఞానము కల్గియుండుటయే పరమ శ్రీమంతమని తెల్పుచున్నది. చివరకు విష్ణు వొక్కడే దేవుడని యాతడే యెల్లర కుపాస్యుడని యాతడే శ్రీమన్నారాయణుడు నేటి శ్రీరంగక్షేత్ర స్వామియే యనియు శ్రీ రంగము దర్శించినంత మాత్రాన సర్వపాపములు ప్రక్షాళనమగునని ఆ శ్రీరంగమే వైకుంఠమని గోదాదేవియే రత్నాకర రాత్మజయని తెల్పుటకు, ఇంక యెంతనీతిగావలె నీతిపరులకు.



# 20

# పాత్రపోషణ.

## విష్ణుచిత్తుడు.

ఈతడు విష్ణుభక్తుడు. భగవంతుని భక్తిచే మనసులో బంధించిన మహనీయుడు. పూర్వజన్మ వాసనచే వేదాంతజ్ఞానము కలవాడు. న్యాయార్జిత విత్తమున యతిథిసత్కారపూజ చేయుచున్నాడు. ఆత్మస్తుతి, సాధుమతముగాదు గావున యతిథుల రావించి షడ్రసోపేతమగు భోజనముచే సంప్రీతి గావించియు నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా కృపయా భోక్తవ్యమన్న భక్తాగ్రేసరుడు. నాగేంద్రశయాను దివ్యప్రబంధసంధాన ద్వారము లను నావతో సంసారసాగరమును దాటుచుండెను. పాండ్యునిసభకేగుమని భగవంతుడు పురికొల్పగా "స్వామీ నన్ను నితఃపురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధునా రామక్ష్మాఖననక్రియా ఖరఖనిత్ర నాగ్రిహితోద్వృత్తిణా స్తోమాన్స్నిగ్ధకరుణ" అని తన వృత్తిని చెప్పుకున్నాడు. ఈతనికి శ్రీహరి ప్రత్యక్ష మెప్పుడన్న యప్పుడే. వెదకుకొన పనిలేదు.

ఈతనికి శ్రీమన్నారాయణుడు యామునాచార్య చరిత్ర వినిపించినాడు. తుదకీతని భక్తికి మెచ్చి ఆముక్తమాల్యదను తనయగా నొసగి మరల భార్యగా గైకొని తానితని కల్లుడైనాడు. విష్ణుచిత్తునికథ వున్నకారణమున దీనికి విష్ణుచిత్తీయమను నామము అన్వర్థాభిధానమైనది. ఈతడు సంస్కృత భాగవతమునకు వ్యాఖ్య ( భాష్యము ) వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. అదియును బృందావనములో ప్రకటింపబడినదట. దీనిని సారస్వతోపాసకులు గమనింతురుగాత.

## ఖాండిక్యుడు.

ఈతడు నిమివంశాలంకారుడగు నృపాల నందనుడు. కేశిధ్వజుని తమ్ముడు. కర్మశూరుడు. మొదట కేశిధ్వజు డొచ్చుటగాంచి "దుర్మతి గెడపెద న్నారంపుభల్లంబునన్" అని వచించినాడు. కాని యాతడరుదెంచినదానికి నిమిత్తంబు చిత్తంబునందరసి శరణన్నవానిని చంపుట తప్పని యాతనికి ప్రాయశ్చిత్తముచెప్పి ( ప్రజలు చంపుమనినను చంపక ) యాతని కృతార్థునిచేసి గురుదక్షిణకై యాతడు వచ్చినప్పుడు రాజ్యముగోరు

మని పత్రిజలు తెలిపినను కోరక సంసారసాగరమును దాటుమార్గమడిగి యాతనితో భావనాత్రయ స్వరూపమగు భగవంతునిజేరు మార్గము తెలిసి కొని విరాగియై తరించిన మహనీయుడు.

## కేశిధ్వజుడు.

ఈతడు ఖాండిక్యుని యోడించినవాడు. ఓడించియు శునకముని ఖాండిక్యునే ప్రాయశ్చిత్త మడుగుమనగా గర్వములేకపోయి పరల నతనినే అడిగినాడు. తుద కాతడు చంపిన క్రతు ఫలము దక్కదనియు, చంపకున్న యాగము సఫలించునని యెటులైన మంచిదేయని తలచి యాతన నాశ్రయించినాడు. గురుదక్షిణ యిచ్చుటకై పోయి నాతడు సంసారసాగరమునుండి తరింపుమార్గ మడిగి నను యీర్ష్యలేక భావనాత్రయ స్వరూప ముపదేశించెను. తుదకు ఖాండిక్య కేశిధ్వజులు నిమివంశము పావనముచేసిరి.

## యామునాచార్యుడు.

ఈతడు బ్రహ్మచారి—విష్ణుభక్తుడు. అష్టాదశ విద్యలందు సమాన విశారదుడు. విష్ణువు యాదే

శానుసారము వైష్ణవమత ముద్ధరింపగవచ్చిన గుప్తి. పాండ్య మహీపాలుని పట్టమహిషి వైష్ణవభక్తురాలని తెలిసికొని యామె సహాయమున పాండ్యుని సభాస్థలి సొత్తెంచి వైష్ణవమత స్థాపనజేసిన మహాసీయుడు. ఈతడిది జ్ఞానపూరితమగు భక్తి. రాజు సభలో విజయమొందిన తర్వాత రాజు చెల్లెలిని వివాహమాడి కేవల విషయసుఖాస్వాదలోలుడై కాలము గడుపుచుండె. తర్వాత కొంత కాలమునకు శ్రీరంగేశ్వరుని పాదారవిందములు మోదంబుతో స్వప్నంబులోన వీక్షించి విరాగియై రాజ్యమును తన కుమారున కప్పగించి రాజనీతి బోధించి శ్రీరంగ మరిగి తరించిన భక్తప్రివరుడు.

## పాండ్యుని రాణి.

ఈమె పతివ్రత, విష్ణుభక్తురాలు. ఏకాదశీ వ్రతము నిష్ఠతో నాచరించుచుండెను. ఈమె శీలము చక్కగా శ్రీరాములు "వింగడంబైనట్టి" అను పద్యంబున తెలపియున్నాడు. యామునాచార్యునికి సభాప్రవేశమున కవకాశమిచ్చిన భక్తురాలు ఈమెయే.

## రెండవ పాండ్యరాజు.

ఇతడు శివభక్తుడు. విష్ణుభక్తుల నాదరింపడు. శివభక్తులకే యగ్రహారముల నిచ్చును. భక్తులైనను శైవులను, శిక్షింపడు. విష్ణుభక్తుల పరిహాసముచేయును. ఆతని దురంతం బింతింతయని చెప్ప నలవికాదు. తుదకు వైష్ణవుడై యామునికి తన చెల్లెలినిచ్చి వివాహము చేసినాడు.

## మాలదాసరి.

ఈతడు మాతంగుడు. విష్ణుభక్తుడు. ప్రతిదినము మంగళకైశికిరాగమున కురుంగడి పాడుచుండు భక్తశిరోమణి. భగవంతుని తీర్థప్రసాదములను ప్రతిదినము గ్రోలనిది యింటికిపోడు. ఇతడు తనకు నిర్దేశింపబడిన ధర్మమును తప్పక నాచరించుచుండెను. బ్రహ్మరాక్షసునితోఁగూడ భయములేక మాట్లాడి నాతని మెప్పించి యాతని చరితము విని యాతనినికూడ నొక భక్తునిగాజేసిన మహాపురుషుడు.

## బ్రహ్మరాక్షసుడు.

ఈతనికి భగవంతునిపైనున్నది మూఢభక్తి. ఈతడుకూడ విద్వాంసుడై తార్కికుల ప్రజ్ఞల

పరిహసించుచుండెను. సర్వదురిధముల గర్వముతో ధనమార్జించి శ్రీమంతుడై దొంగలచే దోచుకొనబడి రాక్షసాకృతిబొందినవాడు. ఈతని నివాసస్థానము చోళభూమి. మరల మాలదాసరివచ్చి తనను భుజింపుమని అడిగినపుడు అతని భక్తికిమెచ్చి తన కౌగిటనుంచుక గారవించినాడు. నన్నవశ్యము శ్రీహరి కటాక్షించునని తెలిపెను.

## ఆ ము క్త మా ల్య ద .

ఈమెయే కథానాయిక. దాననే యీ గ్రంథమునకీ నామముకల్గినది. ఇట్లు పేరుపెట్టుట యందు భట్టబాణుని యనుకరించినాడు. విష్ణుభక్తునకు భగవత్ప్రసాదమున దొరకిన కూతురు.

ఆముక్తమాల్యద యనగా ఆముక్త = తనచే ధరింపబడిన, మాల్య = పూలదండను మాల్యద = ఇచ్చునది. దీనికిసరియైన నామము ద్రావిడభాషా పదము శూడుకొడుత్తాళ్, ధరించునది. దాననే కదా శ్రీమన్నారాయణుండు శ్రీరాయలను తన స్వప్నచేత ఆముక్తమాల్యద వ్రాసి ఆడది మాలధరించివేసిన కొదువ తీర్పుమన్నాడు. ఈమె చక్కనిది.

యవ్వనము రాగానే లక్ష్మీకల్యాణముల జూచుచు తానా శ్రీహరిని నాథునిగా బడయుటెన్నడో యని నువ్విళులూరుచు తన జనకుడు చేసిన మాలికల గాను ధరించి నీళ్ళలో ప్రతిబింబమీక్షించి మురియుచు తుదకాతనినే వరించినది. ఈమెది అనురాగపూరితమైన భక్తి. ఈ ప్రేమయే నిత్యము శాశ్వతము. దివ్యము నిర్మలమైనది. మానవ ప్రేమలకన్న పెక్కురెట్లు శ్రేష్ఠమైనది.

## శ్రీమన్నారాయణుడు.

ఈతడే యీ గ్రంథపాత్రలకు సర్వాధికారి. సర్వం విష్ణుమయమ్ జగత్ అను నాభాషణము నీ గ్రంథమందు ప్రతిపద సార్థకము గాంచినది. గోదాదేవియగు ఆముక్తమాల్యద తనయొద్ద నిలిచి యుండ ఆమె త్రిభువన మోహితమైన రూపవిలావ విభ్రమాది సౌశీల్యంబుల మనంబున ముదంబు గొంది పంచేషు విలుంఠలుంఠిత మనస్కుడై మైత్రి నొనరించుకొనియెను.

# 21

## గ్రంథ దోషములు.

ప్రతి గ్రంథమందు దోషము లుండకపోవు. ఎవ్వడును సర్వజ్ఞుడు కాడు. ఈ గ్రంథము వ్రాసి నది రాజు కావున కొన్ని తప్పు లుండకపోవు. అట్లయినను శ్రీహరిని మెప్పింప తనచే నుత్తమ కవితయని నుడివియున్నాడు. దీనిలో వ్యాకరణ దోషములు మొదటి దోషములు. క్త్వార్థకార సంధి, ఇత్వసంధి, అత్వసంధి యిత్యాదులు సంధి దోషములు. సాహిత్యతత్త్వవేత్తలు ప్రసాదరాహిత్యము శ్రుతికటుత్వదోషములకు అకాండప్రకాశన కాకర మూముక్త మూల్యాద యని నుడివియున్నారు. ప్రసాదరాహిత్యమున్నది నిజమేకాని దానిని యొక దోషముగా పరిగణింప కూడదు. కొందఱు కవులు నారికేళపాకములో రచియింతురు, కొందఱు ద్రాక్షాపాకములో ముక్కుతిమ్మనవలె ముద్దు ముద్దుతాలుకు జిలిబిలి పలుకు లలరగ వ్రాతురు. ప్రసాదగుణము యీ గ్రంథమందు స్థాలీపులాక న్యాయమునుగా నున్నది. ఈ విషయములో విజయ

(ఇదివరకే నుదాహృతము) అను పద్యముకన్న మిక్కిలి కఠినతరముగా స్యందనస్థిత యను పద్యము. దానినే యిచ్చట నుదాహరించుచున్నాను. కృతి కఠినత్వమున కిదియే మంచి ప్రమాణము. ఇంతటి యశిథిల జటిలపదబంధనము మఱి యెవ్వనియందును గానము. ఆముక్తమాల్యద యర్థము కాకున్నంత మాత్రాన దాని గొప్పతనమును మనము తూలనాడకూడదు. అది యర్థము కాలేదన్న యది యర్థము చేసుకొనగలిగిన సామర్థ్యము మనకు కల్గలేదని విచారింపవలెను.

సీ॥ స్యందనస్థిత విరోధిక్షత్ర జాద్యశ్ర
ఘృష్టా మరుద్గరుఝ్ఝాత్కృతములు
క్రవ్యాసిరాడ్గాత్రి కనదసృగ్గాహన
స్ఫాలశల్య హావభు క్ఫూత్కృతములు
యోధపర్యస్త వాత్స్ఫుటోత్క్రాంత నిజపాత
సాలాశ్మకృత ముహుస్థాత్కృతములు
పతితోగ్ర రక్షః కబంధ భారభృణార్తి
భుగ్న భోగ ఫణీంద్ర ఫూత్కృతములు

క్రాంత రథ్యానిరంతర చ్ఛాయుదముల
దివ్య తావక కార్ముకోత్క్రేరితములు

కలుషము లడంచుగాత లంకాపురాంగ
ణాంబర చలత్కృలంబ కదంబకములు.

శ్రుతికటుత్వమునకు నుదాహరణమే. ఇంకను "కాంచెౕ వైష్ణవు" "అద్ధావాగ్వ బుధం" ఇత్యాదు లుదాహృతములు. ఎట్లయిన నేమి ఆముక్తమాల్యద భస్మసంవృతమైన మహాగ్ని కణంబు, ఒకాలుజనపల్లి సీతారామాచార్యులవారు గూడ కొన్ని వ్యాకరణ దోషంబు లున్నవని వచించిరి. కాని పై దోషముల పేర్కొనదల్చను.

ఇంక అకాండ ప్రకాశనముగూర్చి కొంత పరిశీలింతము. పై విషయమునకు కొంత కథా సంవిధానము చర్చింపవలెను. అకాండ ప్రకాశన మనగా సన్నివేశములను హఠాత్తుగా చొప్పుటం. ఇందలి సంఘటన లిదివరకే తెలిసియున్నాను. విష్ణుచిత్తునికథ, ఆముక్తమాల్యద చరిత్ర యీ రెండు ప్రధానగాథలు. గ్రంథనామమునకు సరి పోయినవి. కాని మధ్యన యామునాచార్య చరిత్రము, ఖాండిక్య కేశిధ్వజవాదము, చండాల బ్రహ్మరాక్షస సంవాదములు మధ్యలో కల్పించి

నాడు. ఈ కథలను గురించి వ్రాయుటలో శ్రీరా యాలకున్న లక్ష్య మిదివరకే వచించియుంటిని. విష్ణుచిత్తుడు స్వమతస్థాపన చేసిన తర్వాత తనమత ప్రాశస్త్యమును తెలుపుటకే ఖాండిక్య కేశిధ్వజవా దముజొనిపెను అకాండ ప్రకాశనమనగా కారణా కార్య సంబంధములేనిది యే విషయము సంభవింప గూడదు. ఖాండిక్య కేశిధ్వజవాదములో విశిష్టా ద్వైతమత సిద్ధాంతము చక్కగ చెప్పబడినది. ఆత్మ నారాయణ స్వరూపమని, ప్రాణికోటికి బంధంబు మోక్షంబు చేరుటకును మనసుకారణ మనెడి వేదాంతతత్త్వబోధ వివరముగా చెప్పబడి నది. విశిష్టాద్వైతమత సిద్ధాంతమంత వివరముగా విపులముగా పృథివీపతికి చెప్పినగాని యాతనికి వైష్ణవమతముం దెక్కుడు గౌరవము భక్తి కుదు రదు. శివ ఆఖ్యానము పూర్తియగువరకు అకాండ ప్రకాశన మిచ్చుటను లేదు. విష్ణుచిత్తుడుమధుర గృహమున కేతెంచునపుడు శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించె. ఇక్కడాతడెందుకు సాక్షాత్కా రము గావలెనన్నది మూలములో కలదు. దానిని శ్రీరాయ లేమిచేయగలడు. కాని ప్రబంధమునకు శ్రీమన్నారాయణుని దశావతారస్తవ మవసరము

కదా నాకతమునసే ఇందు పన్నెండు పద్యములు దశావతార స్తవము జెప్పింపబడినది.

యామునాచార్యుని కథవచ్చుట అకాండ ప్రకాశనమనరాదు. ఏలనన యీ ఘట్టమును జెప్పించుటలో జ్ఞానసంబంధమగు భక్తికి తెల్పుటకే పురుషునకేగాని, స్త్రీకేగాని భక్తియున్న యెడల యది పరమేశ్వరునిపై నుండవలెను. అది మూఢభక్తియే కానిండు, జ్ఞానసంబంధమగు భక్తియే కానిండు. వైష్ణవమత ప్రాశస్త్యమును తెలుపుటకే యీ ఘట్టము జొప్పింపబడినది. ఇందులో శరదృతు వర్షాఋతు వర్ణనలు సమంజసముగానే యున్నవి. వర్షఋతువు తర్వాత శరదృతువు. శరదృతువులో దిగ్విజయయాత్ర సార్వభౌమ ధర్మము. అందుకై రాజనీతి ప్రసంగము. కథ వివాహాంతము. వివాహముకై అయోగ విప్రలంభ మవసరము. అందుకై వసంత మవసరము.

ఇక తర్వాత చండాల బ్రహ్మరాక్షస సంవాద మకాండ ప్రకాశనమున కుదాహరణము. ఏలనన నీ ఘట్టి మనవసరముగా జొప్పింపబడినది.

ఆముక్తమాల్యద విప్రలంభ భరమును శ్రీహరికి వచించిన యాతడు చండాల బ్రహ్మరాక్షస సంవాదము చెప్పి శ్రీరంగమునకు కొనిపోయి నీ కూతును శ్రీరంగేశ్వరున కర్పించు మన్నాడు. ఈ కథతోల గించినను ప్రధానకథకు ముప్పు వాటిల్లదు కథాంథ నమునుబట్టి చూచిన. కాని యీ ఘట్టము జొప్పించుటలో బ్రహ్మరాక్షసునికి శ్రీహరియందుగల మూఢభక్తిని చెప్పుటకే. యామునాచార్య చరిత్రము చెప్పుటలో సమంజసము కలదు. యామునాచార్యుడు విష్ణుచిత్తు డొకడేనట కాని విష్ణుచిత్తుడు యామునాచార్యుని పునర్జన్మ. విష్ణుచిత్తునికి తన పూర్వకథవిన్న నాహ్లాదముగా నున్నది. ఈ చండాల బ్రహ్మరాక్షస సంవాదము ప్రధానకథతో సంబంధమున్నదా లేదా యనునదికూడా సందేహాస్పదము. నాకు యామునాచార్యకథకు ప్రధాన కథకు, ఖాండిక్య కేశిధ్వజ వాదనకు ప్రధాన కథకు వున్నంతే సన్నిహితసంబంధ దీనికి వున్న ట్లగపడదు. ఈ కథ వరాహపురాణమునుండి గైకొనబడినది. దాని సంగతి విపులముగా, వివర ముగా, విమర్శగా, విశేషముగా సంఘట్టనాసంధానమందు ముచ్చటించియున్నాను. ఆకాండ

ప్రకాశనమునకు ప్రసాదరాహిత్యమునకు ప్రతి
కటుత్వమున కాకరము ఆముక్తమాల్యద యను
టలో తప్పేమిలేదు యొప్పే.

# 22

# కృష్ణరాయల ఆత్మీయత—చిత్తవృత్తి.

ఆముక్తమం దుద్బోధింపబడిన పరమార్థత్త్వము.

కృష్ణరాయలోకయనన్యతవ్యక్తి.
ఆతని కాంధ్రమన్న నెక్కు డభిమానము
కావుననే దేశంబు తెలుగేను తెలుగువల్లభుండ
అని అన్నాడు. తన కవిత్వము శ్రీహరి కళంకము
దీర్ఘగల మహత్త్వము గలదని వచించినాడు.
[అదియే మన ఆముక్తమాల్యద పూలమాలను
ప్రథమమున ధరించి మరల శ్రీరంగేశ్వరుని కొసంగి
నది.] శ్రీహరియే యుక్కుడువగప్పు ప్రియావరి

శైవమతమునకున్న నిరసనము పూర్తిగా వర్ణింప బడియున్నది. రెండవ పాండ్యరాజును యామునాచార్యుని సహాయమున, భార్యసహాయమున వైష్ణవ మతానుయాయిగా జేసినాడు. ఆత్మ శ్రీమన్నారాయణ స్వరూపము సృష్టి స్థితి లయముల కధిపతి యతడేయని నిర్ణయించుటకే ఆముక్తమాల్యద వ్రాయబడినది. "ఏకోనారాయణోహరిః" అను నుపనిషద్వాక్య మొక్కటియే సత్యము. మిగిలినది యబద్ధము. ఆత్మ శివస్వరూపముకాదు, అసలు శైవమతము మతమేగాదు. శైవమతావలంబి లింగము కట్టుకొనవలెను, వైష్ణవమతమవలంబించినవాడు మురఘుస్మరచక్రాంకితుడు కావలెను. ఇంక విష్ణుచిత్తీయమునందు ప్రతిపాదింపబడిన వైష్ణవ మతమును, వైష్ణవమత సిద్ధాంతములను వివరముగ, విశేషముగ, విమర్శనగ, వక్ష్యమాణ విధమున తెలుపుచున్నాను.

నారాయణుడొక్కడే సత్యము. మహేశుడు నాస్తి, బ్రహ్మ, భూమి, నభము, సూర్య చంద్రాదులు లేరు. నారాయణునికన్న మించిన దేవుడులేడు. తానుగానట్టి దేహమందు తానవెడి

తలంపును, బంధు మిత్ర కళత్ర పుత్రాదులు తనవా రను నీ రెండు నజ్ఞానవృక్షమునకు మూలబీజము పంచభూతాత్మకమయిన శరీరమందు జీవాత్మ అవిద్యవలని దట్టంపుచీకటులచే నావరింపబడినవాడై అహంకార మమకార భ్రాంతిలో తిరుగుచుండును.

ఆత్మ పృధివ్యాపస్తేజో వాయ్వాకాశములకంటె వేఱయి ప్రకాశించుచుండుకాన దేహ మాత్మ గాదు. పుత్రమిత్రకళత్రాదులు దేహమునకు భోగ్యములుకాని యాత్మకు చెందవు. మానవునకు జన్మించిన పుత్రులను తనవారలని తలంపఁజెల్లదు. దేహ మాత్మకాదు. పాంచభౌతికమయిన శరీరము పాంచభౌతిక భోగానుభవములచేత నిలుచును. భౌతికముకానట్టి యాత్మకు భౌతికములయిన భోగము లంటవు. సంసారియైన జీవుడు వేలకొలది పెద్ద పయనములుగల సంసారసాగరమందు అనాదికర్మ వాసనలనెడి ధూళిలో మ్రుంగుచు అవిద్యయనెడి వేడినీళ్ల స్నానముచే ఆ కర్మవాసనాధూళిని కడిగి కొనునో అప్పుడవిద్యారూపసంబంధమగు బడలిక తీరిపోవును. అజ్ఞానంధకార తమసము పటాపంచలై జ్ఞానజ్యోతి ప్రకాశించును.

ప్రాణులకు బంధమోక్షములకు మనసే కారణము. ఆమనస్సు సవిషయమైనచో బంధముం జేయును. నిర్విషయమైనచో మోక్షముఁ జేయును. చిత్తము పరాయత్తముకాకుండ బ్రహ్మమును చింతించుటయే యోగమనబడును. అది మోక్షమున కత్యావశ్యకంబు. బ్రహ్మమే యాశ్రయము. బ్రహ్మము ద్వివిధములు మూర్తము, అమూర్తమని. పరము, అపరమని బ్రహ్మ మిరుదెఱంగులు అందు పరము ముక్తమైయున్న యాత్మ అమూర్తమగుటంచేసి ఉపాసనకు శక్యముగాదు. మఱి హిరణ్యగర్భాది రూపంబులనుండు బద్ధజీవసంఘాతమగు నపరబ్రహ్మము మూర్తివంతమగుటం జేసి నుపాశింప శక్యమయినను భావనాత్రియము కలదై యుండుటచేసి నుపాసన కర్హముగాదు. భావనాశ్రయ ముపాసించుట శుభాశ్రయముగావున విష్ణువు నుపాశించుటే శ్రేయస్కరము. యోగులకు హృదయమందు ధ్యానోపయోగియై అమూర్తమైన మఱియొక రూపము విష్ణునామకము కలదు. దానినే ప్రాజ్ఞులు సత్తని వ్యవహరింతురు. ఆ రూపమే సమస్త శక్తులకు ఆశ్రయమై కల్యాణగుణములు కలదై మహిమాతిశయముచే నొప్పుచుండును.

ఆ విష్ణువునకు (దేనిని ప్రాజ్ఞులు సత్త్వని యందురో) యీతని కొక స్థూలరూపము కలదు. యేదనిన

"శరదిందు చకచకస్మయ జిత్ప్రసన్నాస్య
దొడ్డకెందమ్మి కన్దోయివాని"

యిదివరకే నుదాహృతము. ఇటువంటి స్వరూపము గలవానిని చింతింపవలెను. ఇదియే యిందు బోధింపబడిన పరమోద్దేశ్యము విశిష్టాద్వైతమత సిద్ధాంతము.

ఆనాటి మత్స్యధ్వజుడే శ్రీ రాయలు. అతడు మంచి దానపరుడై నగరీపరిశోధనార్థము శ్రీరామచంద్రునిపగిది యరుగుచు బుధజనవిధేయుడై వేదాంత కవితాగోష్ఠులతో కాలము గడుపుచుండెను. శ్రీ రాయలు మంచి రాజకీయవేత్త. దాననే చక్కగ యంత వివరముగ విభజించి పాలింపుమను రాజ్యపరిపాలనావిధానమును బోధించెను. అతడు మంచి జ్యోతిష శాస్త్రజ్ఞుడు. అందుకు ప్రబల ప్రమాణ మీ క్రిందిపద్యమే.

మ. మునుపే చంద్రబలంబుగల్గి మల
యంపుగ్ గప్పులేగాడ్పు దే

రున నేతెంచు లతాంత బాణునకు
సూర్యాంశు న్మహిం గ్రొత్తగా
ననుకూలించె జలంబునన్ వరహి
ణీ పాణిగ్రహణంబు సే
యన నూహించువిధాతకృత్యమది
యేలా మాను నెప్పట్టునన్.

కృష్ణరాయలుకూడ మంచి భక్తుడు. బుధ జన విధేయుడు. అతని కొలువుకూటము సంక్రంద నందనుని కొలువుకూటమువలె నలరారుచుండెను. అతడుకూడ "రాజానాం బహువల్లభాః" యను సామెతను సార్థకముచేసినవాడే "ఆంధ్రుడే"

ఇంక ఆత్మీయత (Personality)ను కొంత పరికింతము. అతడు మొదట రాజు. తరువాత సామాన్యజీవితము గడపినవాడు. నీల మేఘము డాలుడీలు సేయగజాలు యని వర్ణించిన పద్యము కొంచె మాతనికి వర్తించిన నక్షీణముగట్టి కొలువు కూటమున సింహాసన మధిష్ఠించి సకుంఠగరిమతో రాజ్యమేలిన రాజన్యుడు. ఇతర రాజన్యుల రాజ్యం బుల భోజ్యంబున కాజ్యంబుపగిది గావించినవాడు. సంగీత విద్వాంసుడు, వేదాంతోపాసనగలిగినవాడు.

# శ్రీ రాయల కావ్యస్థానము.

ఇప్పు డాముక్తమాల్యదను పంచ ప్రౌఢ కావ్యములతో పోల్చి కావ్యలక్షణములబట్టి కావ్య స్థానము నిర్ణయించవలసివున్నది. కావ్యలక్షణము లన్న మహాకావ్యలక్షణములు మరియు ప్రసాద మాధుర్య కావ్యగుణములు. పంచప్రౌఢ కావ్యము లేవనగా

1. శ్రీనాధ కవిసార్వభౌముని విద్వదౌషమగు శృంగార నైషధము.
2. శ్రీనాధ విద్యాధికారి అయఃపిండమగు కాశీఖండము.
3. పెద్దనామాత్యుని మనుచరిత్రము.
4. తెనాలిరామకృష్ణుని పాండురంగమహాత్యము
5. శ్రీరాయల విష్ణుచిత్తీయ నామాంతరమగు ఆముక్తమాల్యద.

సంస్కృత కావ్యమే ఆంధ్ర ప్రబంధపుని వచించియుంటిని. కావ్యలక్షణములు సంస్కృతాలంకారికు లీరీతి నుద్ఘోషించియున్నారు.

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయవర్ణనః
ఉద్యాన సలిలక్రీడామధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనః
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయాః
ఏతానియత్రవర్ణ్యంతే తన్మహాకావ్యమిష్యతే
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమిష్యతే

(విద్యానాధుని ప్రతాపరుద్రీ)

ఈ పైయష్టాదశవర్ణనలలో ఆంధ్రగ్రంధ కర్తలు కొన్ని వర్ణనలనే పాటించిరి. అవి పుర వర్ణన, నాయకవర్ణన, వేటవర్ణన, దూత్యా విప్రలంభవర్ణన, చంద్రార్కోదయ వర్ణన ఉద్యాన సలిలక్రీడలు, వివాహవర్ణన, శైల వర్ణన లిత్యాదులు.

ఆముక్తమందు పురవర్ణన, ప్రయాణా విప్రలంభవర్ణన, ఋతు వర్ణన, ఉద్యాన విహావర్ణన, దశావతార స్తవము, రా యిత్యాదులు వర్ణింపబడిరి. కావ్యమున శృంగారమేకాని, భక్తియేకాని, వరమేకాని ప్ర రసముగా నుండవలెను. ఇందు భక్తిశృంగార

కలవు. విష్ణుచిత్తునికథ భక్తిరసమును, ఆముక్త మాల్యదా చరిత్రము శృంగారమును తేటతెల్లము చేయుచున్నది. ఈ గ్రంథరాజమందు సామాన్య వర్ణనలేగాక కొన్ని యనన్యసామాన్యవర్ణనలు జొనిపియున్నాడు. పల్లెటూరి జీవితముల దృశ్యములు, నాడు భోజనమం దుపయోగించెడి పదార్థములు, రాజనీతి చెప్పుటలో తనొక రాజకీయవేత్తనని తానారీతి రాజ్యమేలితినని చెప్పుటకుచేసిన పన్నాగము. ఋతువర్ణనలు విసువుజనించునట్లుగా జేసెను. కృష్ణరాయలు మంచి ప్రకృతిశాస్త్రవేత్త. ఈ పై పేర్కొనబడిన యధికమగు క్రొత్త వర్ణనలు శ్రీరాయల గ్రంథమునకు ప్రాశస్త్యము గల్పించుచున్నవి. ఇతడు ఋతువర్ణనలో చూపినప్రతిభ యప్రతిమానము. కృష్ణరాయల ఋతువరనయందున్న విశేషమన యాతడు ప్రకృతిలోని సామాన్యముగు స్వాభావిక విషయములను సంపూర్ణ విమర్శతో వర్ణించును. మచ్చుకై యీ చిన్ని విషయమును గనుడు.

అలపర్జన్యుడు భానుడన్కాలిమిలో
నభ్రింపు పెన్గాపెప్పరన్

జలమార్గ బిడుగుక్కజాత్యపుటయ
స్కాంతంపు నత్తుక్కలో
పలజూప న్మహిమీాది లోహరజముల్
పైబర్వినాలీచెవా
త్యాల ద్రావమఘుత్తొగిల్గొదల గ్ర
ద్దంత్రై దివిఁ లేచిన.

వర్షాకాలమున సూర్యుడుండగానే మేఘ మగుట, వెంటనే సుడిగాలివీచుట, తరువాత గ్రీష్మ కాలోష్ణవాయువులు భూతలమునుండి మింటికెగ యుట సహజముగదా! ఇదే విషయమును కవి చెప్పదలచినది. దానిని చక్కగ సూర్యుని కొలిమి గాను, ఆకాశము వర్షాధిదేవతయైన యింద్రుడు ఋతుధాకాలము యథామితికై వృష్టినొసంగ నుంచు కొన్న కళాయిగా నుత్ప్రేక్షించినాడు. పదినెలల నుండి నీరునింపక పడవైచినందున త్రుప్పేమయిన బట్టి బెజ్జములుపడి అతుకులు నోరుదెఱచినయెడల కళాయిలోని నీరు నిలువక కారిపోవునుగాన కళా యిని ఆ కొలిమిలో కాల్చి మరమత్తు సేయుటలో కరము దిట్టపరచుటకై దానిలోపెట్టిన పిడుగు జాతి యొక్క సంబంధమైన సూదంటురాయిగాను

వెంటనే సుడిగాలి వీచుటయు దానిచే భూతలము నుండి కడచిన వేసవి కార్చిచ్చుల సెగలు మింటికెగయుటయు యా సూదంటురాయిచే ఆకర్షితములై భూమిమీది యినుపరజము తెగిరిపోయి ఆ రాతి తునుకపై బడి అతుకుకొనినట్లుండెను.

సామాన్య విషయమును అనన్యసామాన్యను త్ప్రేక్షాలంకారమువల్ల నూత్నముగజేసి నొక విషయమునే మరల మరల చెప్పి మనమనములలో గూడ భావమును గల్గింపచేయుటయే యీ కవి లక్ష్యము.

శృంగారరస వర్ణనలకు శ్రీనాథునికి, భక్తిరసమునకు పాండిత్యమునకు రామకృష్ణునకు, వర్ణనాపటిమకు పెద్దనకు, నిస్సందేహముగ పోల్చవచ్చును. శ్రీరాయలు శృంగారరస వర్ణనయందు శ్రీనాథునకుగాని మహాకవి శార్దూలమగు కాళిదాసునకు గాని యేమియును తీడిపోడు. శ్రీనాథుడు శృంగార రస సామ్రాజ్య సార్వభౌముడు.

కాళిదాసుని మేఘసందేశము.

తన్వీశ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీ ప్రేక్షణానిమ్ననాభిః

శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రాస్తనాభ్యాం
యాతత్రస్త్రీ యువతివిషయే సృష్టిరాద్యేవ
(ధాతుః

## శ్రీనాథుని శృంగారనైషధము.

సీ. నిబిడశైశవ యౌవనీయ సంధ్యావేళ
యానన చంద్రబింబామృతంబు
లవనామృతాంశు బాలప్రభాజాలంబు
బంధుజీవలతాంత బాంధవంబు
పరిపక్వబింబికా ఫలవిడంబనముద్ర
విద్రుమద్రుమలతా వినియమంబు.
మదననారాచ కోమలహైంగుళచ్ఛాయ
యస్మన్మనోను రాగాంకురంబు
మహిత లావణ్యగుణ జాయమాన బహుళ
మాధురీ చిత్రశోభా సమన్వితంబు
ప్రార్థనాకల్ప పాదపప్రాజ్యఫలము
తీయపూదేనియల క్రోవి దీని మోవి.

## ఆముక్తమాల్యద.

క. లేగాదిగ నితంబము
ప్రేగున త్రెంపుదియుఁగని వీఁంచిబిగింపక

లోగముడి యుకియెువదలుగ
నాగోకస్తని గభీరనాభిసెలంగుఁ.

పాండిత్యమునకు శ్రీరంగము వర్ణించు
"చనికాంచెఁ విరజాభి"

యితఃపూర్వ ముదాహృతము చూడు పేజి 57.

అను పద్యమునకు కాశీఖండములోని

శా. గాంచెఁ గాంచనగర్భసంభవుడుద
 గ్రగ్రావకోటిస్థల
చంచన్నిర్ఝరవేణికాసలిల సం
 జాతాబ్జ సౌగంధ్యముఁ
బంచాస్య స్ఫుటకంఠనాదహతశుం
 ఛత్కుంభిగర్వాంధ్యముఁ
న్యంచాద్ధాటక భూమిభృచ్ఛిఖరగ
 ర్వాపవ్యంధ్యముఁ వింధ్యముఁ.

అను పద్యమునకు బోల్పవచ్చును. మనుచరిత్రకారుడుకూడ రాయల పండితపరికాండుడే. అతడద్ధివాగ్విబుధం అను పద్యమునకు

మ. చకితైణాహతి దావమావలిత పు
చ్ఛస్వల్పగచ్ఛాశర
క్షుకముద్విగ్రహయాశుభల్లుకము వ
క్షోభాగ నిక్షిప్తడిం
భక వల్గత్ప్లవగీకదంబముహ్రదాం
భః ప్రోత్థితక్రోడసా
యకమాభీలముఖ ద్విపిస్థపుటితం
బయ్యెఁ దసంబద్ధరిన్.

అదియునుగాక రాయలాముక్తదా వివాహ ఘట్టములలో ఆముక్తదాలంకార క్రమము తెలుపుచు పద్యమొక్కటి వ్రాసెను. శ్రీనాథుడు దమయంతి నలంకరించు ఘట్టములో వచనము వ్రాసెను.

ప.ది.

శ్రీనాథుడు:—

వ. “కనకవేదికాంతరంబునం బసిండి పీఠంబున నునిచి ప్రతిపత్తికంబును” అను వచనము.

ఆముక్తమాల్యద:—

సీ. యావకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తు
లభ్యక్తములుచేసె నతివయొర్తు

సయికల వ్రేళ్ళమట్టియలు బిల్లాండిడి
పాయవట్టము బెట్టిబైనోకర్తు
నెఱికవట్టిపసిండినీటి వ్రాతచెలంగు
వెలిపట్టు రహిగట్టి వెలదియోర్తు
కటిసీమ గనకమేఖలజేర్చి తారవపో
రములుగలించె గంఠముననోర్తు
కటకములు హస్తసరము లంగదము లంగు
ళీయకములును బాహువల్లికల వ్రేళ్ళ
నిలిపి తాటంకనాసామణుల నమర్చి
బొనిపె సీమంతవీధి జేర్చుకయోర్తు .

శ్రీనాధుడే ప్రబంధపోకడల కనుకరణీయు డనకతప్పదు. పోతనామాత్యుడు వ్రాసిన "ఎవ్వ నిచేజనించు" నను పద్యమునకు "ఎవ్వనిచూడ్కి చేసి జనియించు జగ"మను పద్యము వ్రాసినాడు. రామకృష్ణుని పాండురంగమహాత్మ్యము:—

శా. అంభోరాశి గభీరభీరహిత చి
త్తాభోగభోగావళీ
సంభారామర రాజరాజకృత పూ
జాయోగయోగ్యర్ధి మి

త్రాంభోజా హిమధామసుధామహీశ ని
త్యావాస లక్ష్మీరసము
జ్జృంభాలంకృత వక్త్రివక్త్రిభిముఖ
శ్రీమద్గుణప్రాభవా.

దీనికి "బాలార్కాంశు విజృంభితామల శర త్పద్మాక్ష"యను పద్యమును పోల్పవచ్చును. అది యునుగాక యీ క్రింది రామలింగ కవిలింగని పద్యమునకు,

శా. శాణోత్తేజిత రత్నలక్ష్మి గుమశి
ఖావళిక్షోరాకృతిన్
శ్రేణుఖ్యాళన శాలిమూర్తి కలభ
శ్రీదోహదోద్యన్నవ
క్షోణీజపరిభ ముక్తకంచుక ఫణి
స్ఫూర్తిన్ సఖీబాంధవ
శ్రేణీ ప్రణనకారణోజ్జ్వల కళా
త్సేకాధ్వాత్రై రేవురున్.

దీని నించుమించుగా "స్వామీ నన్ను నిత్య పురాపతితో"యను పద్యమునకు పోల్పవచ్చును. పైదాని నంత సింహావలోకనముచేసిన యీతని కవితా ధార యప్రతిమానము. పాత్రిపోషణమా

యనన్య సామాన్యము, కథ నడిపించు రీతియూ యనిర్వచనీయము. రచనాసంవిధానమూ ప్రశంసనాతీతము, పాండిత్య మపారము, భావగాంభీర్యమూ యత్యలతసంస్తుత్యంబు, వర్ణనా బాహుళ్యమూ వర్ణనాతీతము, సందర్భోచిత మృదుకఠినపదలాలిత్య ప్రయోగదక్షతయూ సంస్తుత్యనాతీతము. ఆంధ్రవాఙ్మయమందాముక్తమాల్యదకు స్వతంత్ర ప్రౌఢప్రబంధముగ ప్రత్యేకస్థాన మొసంగవలెను. ఈతడాంధ్రభారతి కర్పించిన సారస్వత ప్రసూనమాలిక యత్యంత సౌరభభరితమైనది. శ్రీనాధుని సీసముల పోకడలు వాగ్గుంభనము, పోతన్న వృత్తప్రోయగము, సోముని శబ్దార్థపటిమ, రామకృష్ణుని పదక్రమము యీతనికి గుదిరినది. ఆంధ్ర వాఙ్మయమునకు సమగ్రాధికారచరిత్ర లేదు. వ్రాయబడలేదు. ఎప్పుడస్మద్గురువర్యులవంటి విద్వద్వరేణ్యులు వ్రాతురో తెలియదు. వ్రాయబడిననాడు నాంధ్ర కథనాసంవిధానము చక్కగ నిర్వహించినందులకు శ్రీనాథ కవిసార్వభౌమునకు, ప్రౌఢప్రబంధరచకాంధ్రభోజునకు ప్రత్యేకతస్థాన మొసంగుదురు—తప్పదు—తథ్యము.

సంపూర్ణము

# క్షమార్పణము.

శా. ఆంధ్రంబన్న మదీయమానస ముమం
దానందమా కృష్ణరా
యాంధ్రక్ష్మావిభుఁడన్న యెంతో యభిమా
నంబౌ తదీశుండు తా
నాంధ్రుండంచు వచింప వ్రాసిన తదీ
యాముక్తమాల్యంబుపై
ఆంధ్రంబందు విమర్శ వ్రాయు బుధులా
రా నన్ను మన్నింపరే. 1

శా. ఆముక్తంబు ప్రబంధరాజమనుచుం
బ్రాజ్ఞుల్ వచింపంగ నా
కామూలాగ్రముగా పఠింపగలిగె
న్నత్యాదరంబుం దదీ
యాముక్తంబుపయిం రచించితిని ప
ర్యాలోకనంబంచు నా
నామం బర్హమటంచు మద్గురుడు నా
న్యాంబొప్పగా జెప్పగన్. 2

మ. వరుసన్ వ్రాసిరి ప్రాజ్ఞులెందఱో మహా
ప్రాగల్భ్యపారీణతన్
సరసాలంకృతమౌ విమర్శనల నీ
సద్గ్రంథరాజంబుపై
మఱలన్ చర్వితచర్వణంబనుచు కో
పంబూనకే యీ ప్రభా
కరు మన్నింతురుగాత ప్రాజ్ఞులు కటా
క్షంబుంచి వాగ్దక్షతన్. 3

మ. అభినందింపరు నన్ను తుచ్ఛులయి నీ
ర్ష్యావ్యాళసందష్టులై
అభిమానంబగు గ్రంథరాజముపయిన్
వ్యాసంబువ్రాయంగ వా
క్ప్రాభవంబు న్నెగడిమ్ము గ్రంథమది యా
ప్రౌఢత్వముల్ తెల్ప వా
క్ప్రాభవంబున్ గలదే యటంచు మదిలో
భావింతు రెల్లప్పుడున్. 4

మ. సరసాలంకృతమై విదగ్ధపరనా
సారస్య సంయోగ్యమై

సరళంబై నొకచో నిగూఢమగు భా
షాగుంభనాపూరమై
మెరయన్ కర్ణకఠోరశబ్దములు ప్రా
వీణ్యానుకూలంబులై
మురిపంబొప్పగు కృష్ణరాయకవితాం
భోజాస్య ప్రార్థించెదన్. 5



మీకు

ఏ ఆంగ్ల, ఆంధ్ర గ్రంధములు

కావలసినను

# ఆంధ్ర బుక్కు హౌసు

సుల్తానుబజారు :: హైద్రాబాదు.

అని వ్రాయుడు.

భుక్త భాక్యధర్ అన్నాడు. అదిగాక నేను తెలుగురాయఁడ గన్నడరాయఁడనుకాని అన్నాడు. అంకితముకూడ వెంకటచలపతికే అది యును శ్రీమన్నారాయణుని యాదేశానుసారమే. అందును నాతనికి స్వప్నమందగపడి శ్రీహరి యాజ్ఞాపించెను. అదియునుగాక తన కవిత్వము భావధ్వనియుక్తముగాను, అలంకారయుక్తముగాను ప్రౌఢముగానుండునని మొదటనే వచించినాడు. ఆతడపరవిష్ణుచిత్తుడే. ఆతడు ద్వయసద్మపదవద నుడు కావుననే యాతనిని సుఖదుఃఖములు సమాన ములు తత్ఫలముగ నతడు ప్రజారంజకుడై రాజ్య మేలినాడు. ఆతడు యోగాంద్యూఽర్ధమధుద్విషద్విప నుడు కావుననే యింత భక్తిపూరితమగు ప్రౌఢ ప్రబంధము వ్రాయగల్గెను. భక్తిపరుడు కాకపో యిన యింత భక్తిభావముల నింత చమత్కృతితో నిముడ్చలేడు. చందోబృంపత దంతవాగపరనా నిష్పంద ద్వైతసుసంవిదాలయుడు కావుననే తన కున్న వేదాంతమందలి సంపూర్ణ పాండిత్య మెల్ల రకు తెల్లముగావించినాడు.

ఆముక్తమాల్యద వ్రాయుట విశిష్టాద్వైత మత సిద్ధాంతమును సిద్ధాంతరీకరించుటకే, ఆనాడు

నగర మహారాజావారి సంస్కృత కళాశాలాంధ్రో పన్యాసకుడగు మేడేపల్లి వేంకటరమణాచార్యులు శ్రీరాయల ఆముక్తమాల్యద యు నోజోగుణ భూయిష్ఠమనిరి. కాని వారనిన దానిలో మూడు భాగములు పరిశుని ఒప్పుకొనక తప్పదు.

ఈ గ్రంథము వినువారలకు కటువుగా నుండును. పలసన పదజాల మావిధమైనది ఉపయోగింప బడినది. శ్రీరాయలు తన పాండిత్యప్రకర్ష కర్ణకఠోరమగు పదములతో చెప్పి పద్యములల్లిన కాని తన గ్రంథమునకు గౌరవముగాదని యెంచెను. ఈ గ్రంథశైలినే శ్రీహర్షునిసూక్తి చెల్లునని మొదటనే వచించితిని. శ్రుతికటుత్వముకూడ నొక దోషముకాదు. అట్లయిన పాండురంగ మహాత్మ్యమందీ దోషములు లేవా! ఈ గ్రంథము చదివిన శిరోవేదన కలుగుననుట నిస్సందేహము, నిస్సంశయము. కొన్ని పద్యములు మనము సరిగా నుచ్చరింపనుకూడ నుచ్చరింపలేము. శ్రుతికటుత్వమున కుదాహరణములు లసంఖ్యాకములు. ఈ గ్రంథమందొక పద్యమున్నది. అది దశావతార స్తవము కానిది. శ్రీనాథుడు కాశీఖండములోని "దోర్దండ"